# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీధాతనామ సం. ఉగాది, శ్రీరామనవమి విశేష, శ్రీయోగి
విశ్వంజీ మహారాజ్ జన్మదిన సంచిక

సంపుటి : 2 సంచిక : 5 వెల రూ. 15-00



ప్రకాశకులు
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

ఈ సంచికలో.......

సంపాదకీయం
శుభాకాంక్షలు
అభినందనలు
అమ్మ భక్తులకొక శుభవార్త
జిల్లెళ్ళమూడి అమ్మ
ఆదిశంకర జన్మభూమి కాలడి
బ్రహ్మశ్రీ చందోలురాఘవ నారాయణశాస్త్రి సందేశము
ప్రస్థానత్రయము
గురువరేణ్యులు శ్రీయోగానంద నరసింహ మహర్షి
భగవాన్ శ్రీరమణులతో పరమహంస యోగానంద
వృత్తిధర్మం - వృత్తిగౌరవం
శ్రీవల్లభ చరితామృతం
దివ్యయోగి చరితామృతం.........
సుఖాన్వేషణ
విశ్వశాంతి ప్రదాత.........
శ్రీజ్ఞానానందుల శ్రీకృష్ణోపాసన
శ్రీరామకృష్ణ పరమహంస..........
ఆత్మ విద్య

సంపాదకీయం

# విశ్వప్రేమ

విశ్వ కుటుంబీకులకు అంటే విశ్వ కుటుంబ సభ్యులకు మార్చి నెల అత్యంత ఆనందప్రదమైనది. ఆ మాటకు వస్తే విశ్వకుటుంబ సభ్యులుకాని వారెవ్వరు? 'విశ్వం విష్ణుం' కదా! ' పుంసాముదార చరితానాంతు, వసుధైక కుటుంబకం' అని ఆర్యోక్తి. వసుధే ఒక కుటుంబం; వసుధ అంతా ఒకే కుటుంబం అని కూడా చెప్పవచ్చు. యుగయుగాలనుంచి ఇలాతలం మీద అడుగిడిన ఆధ్యాత్మికవేత్తలందరూ, మతాచార్యులందరూ, పరమహంసలందరూ, ప్రవక్తలందరూ, జగద్గురువులందరూ ఈ విషయాన్నే ప్రబోధిస్తున్నారు. ఇందుకోసం ఎందరో అవతారమూర్తులు ఆవిర్భవించారు. ఒక గౌతమబుద్ధుడు, ఒక క్రీస్తుయేసు, ఒక మహమ్మదు ప్రవక్త, ఒక ఆదిశంకర భగవత్పాదులు, ఒక బహాఉల్లా ఇదే విషయాన్ని ఆయా కాలాలలో పదే పదే మానవాళికి ప్రేమతో, దయతో, ఆర్తితో, ఆర్ద్రతతో, అంతఃకరణతో, ఆవేదనతో చెప్పారు. తమ తమ మానుషలీలావిభూతిని హారతి కర్పూరంలా వెలిగించుకున్నారు. అగరుధూపంలా వ్యాపింపచేశారు. నవీనయుగంలో శ్రీరామకృష్ణ పరమహంస, భగవాన్ శ్రీరమణమహర్షి, భగవాన్ శ్రీసత్యసాయిబాబా, షిర్డి సాయినాథుడు అదే అదే ఇదే ఇదే పదే పదే మానవాళి చెవినిల్లుగట్టుకొని ప్రేమతోనూ, బుజ్జగింపుతోనూ చెప్పారు. చెపుతున్నారు. చెప్పబోతున్నారు.

ఇటువంటి దివ్య ప్రబోధాత్మక చైతన్య స్వరూపులే విశ్వమందిర విశ్వయోగీశ్వరులు. లోకానికి ప్రేమభక్తి నేర్పించటానికే భగవంతుడు తన దూతలను, తన అంశలను లేక తన ప్రవక్తలను ఆ లోకానికి పంపుతాడు అని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు. తన సంతానంపట్ల ఏ తండ్రికి ప్రేమ ఉండదూ! "వినుత ప్రేమ స్వరూపుడీ విశ్వయోగి" అని సంస్తుతి పాత్రుడు కావటానికే, సమస్త విశ్వానికీ, సంకేతంగా ప్రతీకాత్మకంగా విశ్వమందిర సంస్థితులు అవుతున్నారు విశ్వంజీ మహరాజ్. ఈ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ ఆవిర్భవించినది మార్చి 5వ తేదీన. అందువల్లనే మార్చి నెల విశ్వ కుటుంబసభ్యులకు పరమానందప్రదం. పెద్ద పండుగ. వారు ప్రభవించిన

స్వర్ణోత్సవం ఈ ధాత నామ సంవత్సరంలో జరుపుకుందాం. ఈ పసిడి పండుగ కూడా మరింత ప్రేమోత్కర్షను లోకానికి ప్రసరింపచేస్తుందని ఆశిద్దాం. "విశ్వమయత లేమి వినియు నూరకయుండి, రంబుజాసనాదులడ్డుపడక, విశ్వ మమత కలిమి విష్ణుండు, జిష్ణుండు భక్తియుతున కడ్డుపడదలంచె" అని పోతన మహాకవి గజేంద్రమోక్షంలో అభివర్ణించారు. ఇప్పుడు లోకానికంతకూ గజేంద్ర నిర్వేదఘట్టం సంప్రాప్తమైనట్లున్నది. ' కలడు కలండనెడివాడు కలడో లేడో' అనే విచికిత్సకు సగటు మానవుడు తావలమవుతున్నాడు.. తడబడుతున్నాడు. మొసలి వంటి వెగటు మానవుడు స్వైరవిహారం చేస్తున్నాడు. ఇప్పుడు సమస్తలోకానికి కావలసింది విశ్వమయత. విశ్వమమత. మతాలనన్నిటినీ మమత ఏకం చేయాలి. స్వమత ప్రాగల్భ్యం కాదు. అన్ని మతాలు మానవుణ్ణి స్వస్వరూప సంధానం చేసుకొమ్మనే చెపుతున్నాయి. అందరిలోనూ జీవచైతన్యం ఒకటేనని చెపుతున్నాయి.

పసిపిల్లల వలే మానవులు అచ్చ స్వచ్ఛ అమాయక ప్రవర్తనను ప్రవర్తింపచేయాలి. పసిపిల్లల చిరునవ్వులంతా ఒకే విధంగా ఉంటాయి. వాళ్ళకేరింతలన్నీ ఒకే విధంగా వుంటాయి. వాళ్ళ ప్రేమభర సంతోషవీక్షణలన్నీ ఒకే విధంగాఉంటాయి. తమకు కావల్సినవాళ్ళను చూసినప్పుడు అందరూ ఒకే విధంగా లాలనను, పాలనను కోరతారు. అంతేకాని మాయలు, మర్మాలు అసూయలు, అసహనాలు వాళ్ళకుండవు. ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా ఏ జాతిలోనైనా పిల్లలు పిల్లలే. తల్లులు తల్లులే. మరి మానవులు మానవులుగా ఎందుకుండరు? లోకంలో ఎందుకు ప్రేమ పండించరు? అందుకే కాబోలు ఆంగ్లంలో ఒక గొప్ప సూక్తి వుంది. ఏ మహనీయుడన్నాడో, మానవుల ప్రవర్తనను నేర్పుగా ఏ విధంగా ఆకళించుకున్నాడోగాని "Men are unwiser than children; They do not know the hand that feeds them" అని అన్నాడు. అంటే మానవుడు యుక్త వయస్కుడైన తర్వాత యుక్త మనస్కుడు కాలేకపోతున్నాడు అని. తన ఉనికి, తన మనుగడ, తన ఆహార సంపాదన, తన మనికి, అంతా స్వప్రయోజకత్వమే అనుకుంటున్నాడు. తన సంరక్షణ భారమంతా తనదే ననుకుంటున్నాడు. అది తప్పు. సమస్త విశ్వాన్ని అనుపాలించే దివ్యశక్తి ఏదో అది తనే నన్న ఎరుక సంపాదించిననాడు ఈ కలహాలు, ఘర్షణలు వుండవు అని తెలుసుకోవటం లేదు. `It is strange' how men find time to hate others when life is too short for love` అని ఇంకో సూక్తి మానవ జీవనధ్యేయాన్ని సువిదితం చేస్తున్నది. జీవితమనే అందమైన అవకాశాన్ని, అపురూపమైన వరాన్ని వ్యర్థం చేసుకుంటే, అర్థం చేసుకోలేకపోతే జనన మరణాదులైన సంసార చక్ర పరిభ్రమణ తప్పదని

తత్త్వవేత్తలు అనాదిగా బోధిస్తూనే ఉన్నారు. కాని మానవుడు బాధలు కోరి తెచ్చుకుంటున్నాడు. కొని తెచ్చుకుంటున్నాడు. తన వెంట ఆకొని తెచ్చుకుంటున్నాడు. భారతాలు, భాగవతాలు, రామాయణాలు అతడిలో పరివర్తన తేలేకపోతున్నవి. కాని ' చుట్టి చుట్టి పక్షులెల్ల చెట్టు వెదకురీతి' ఆ పరమశాంతిని పొందాలంటే ప్రేమపథమే శరణ్యం. ' తనకోపమె తన శత్రువు, తన శాంతమెతనకు రక్ష, దయ చుట్టంబౌ, తన సంతోషమె స్వర్గము, తన దుఃమె నరకమండ్రు తథ్యము సుమతి' అని చిన్నప్పటి నుంచీ నేర్చుకుంటున్నా దురాశా, స్వార్థపరత్వం, ఇంద్రియలోలత్వం నుంచి రక్షణ వలయం సృష్టించుకోలేకపోతున్నాడు మానవుడు. ఇటువంటి విషమావస్థలోనే అంధకారంలోనే, దారిదివ్వెలు చూపటానికి భగవంతుని దూతలు భూమి మీదకు వచ్చేస్తూ ఉంటారు. ఇది నిరంతరం కొనసాగుతూ ఉండవలసిందే. ' ఎల్ల కామ్య పదవులకన్న ప్రేమె ఎక్కువరా' అన్నాడొక తెలుగుకవి. అది బోధించటానికే విశ్వయోగివిశ్వంజీ అవతరించారు. అయితే అవిద్యావంతుడి కన్నా విద్యావంతుడే ఆయనకు దూరంగా ఉన్నాడు. అవిద్యావంతుడికి ఒక నమ్మకం, ఒక తాదాత్మ్యం, ఒకగురి అయినా ఉంటవి. ఆధునిక మానవుడొక సంశయాళువు, అన్యమనస్కుడుగా ఉంటున్నాడు. అందువల్లనే దేశంలో ఇప్పుడు ఇన్ని ఆశ్రమాలు, మతాలు, ప్రబోధాలు, సత్సంగాలు, ప్రచారాలు అవసరమవుతున్నవి.

శ్రీవిశ్వయోగి విశ్వంజీ నిరాడంబరంగా పునరుజ్జీవనం వైపు లోకాన్ని నడుపుతున్నారు. తన దరిచేరిన వారిని పర్యవేక్షిస్తున్నారు. మహిమలు చూపని మహిమాన్వితుడాయన. ఆయన దగ్గరికి చేరటమే ఒక మహిమ. తపన శాంతి. అపథ్యం చేస్తూ రోగ నిదానం సరిగా నిర్వహించటంలేదని వైద్యుణ్ణి తప్పుపట్టి ప్రయోజనం లేదు. 'టన్నుల' కొద్దీ చదివి తర్క పటిమ పెంచుకునేకన్నా ' అవున్సు' ఆచరణతో లోకంపట్ల సానుభూతి, బాధ్యత, కర్తవ్యం పెంచుకోవటం మంచిది. అత్యాశల ఎండమావుల వెంట పరిగెత్తేకన్నా ఉన్నదానితో తృప్తిపడి మానసికారోగ్యం పెంచుకోవటం నేర్చుకోవాలి మానవుడు. తన వల్ల లోకానికీ లోకం వల్ల తనకూ ఉద్వేగం కలగటం నుంచి జాగ్రత్తగా తనను తాను పరిశీలించుకుంటూ ఉండాలి. అప్పుడే తనకూ లోకానికీ క్షేమం.

శ్రీవిశ్వయోగి విశ్వంజీ52వ జన్మదినం వారి భక్తులు, ఆశ్రితులు, ఆరాధకులు, అభిమానులు గుంటూరులో ఈ మార్చి 5న జరుపుకుంటున్నారు. భారతదేశానికి ముందు ముందు మంచి రోజులు రాగలవనీ విశ్వమానవ

కుటుంబ భావనకు విశ్వమందిరం కేంద్రం కాగలదనీ సమస్త మానవాళిని ఆశ్వాసిస్తున్నారు స్వామిజీ. విశ్వస్యకల్యాణమస్తు.

** ** **

ఈ మార్చి నెలలోనే మనకు అత్యంత ప్రియమైన రెండు పండుగలు వస్తున్నాయి. మార్చి 20న ఉగాది. మార్చి 28న శ్రీరామనవమి. మోడువారిన శిశిరం నుంచి మోసులెత్తే నవచైతన్యం సంకేతం ఉగాది. మల్లెపూలు మామిడిపండ్లూ మలయానిలమూ మంచిగంధమూ తలపుకు వస్తాయి చైత్రవైశాఖ మాసాల విభవం తలచుకొంటే. యువతకు పరీక్షల హడావుడి, గృహస్థులకు తమపిల్లలకు అనువైన పెళ్ళి సంబంధాల అన్వేషణ, ఈ మార్చి, ఏప్రిల్ నెలల సందడి. కాలపథంలో మరొక మజిలీ. మరొక మైలురాయి ఉగాది. కిందటి శతాబ్ది చివరి పాదంలో వచ్చిన 'ధాత'లో పెద్దకరువు. ఆంధ్రదేశం నిండా హాహాకారాలు. 'ధాతకరువు' పేరిట ఆధునిక చరిత్రలో ఎన్నో కష్టనష్టాలు, ఉదంతాలు నమోదైనాయి. ఈ శతాబ్దిలో ఇదే చివరి 'ధాత' సంవత్సరం. ఇంకొక నాలుగు సంవత్సరాలలో ఈ శతాబ్దం ముగిసి కొత్త శతాబ్దం ఆగమించటమే గాక మరొక సహస్రాబ్దం కూడా ప్రారంభం కాబోతున్నది. మానవుడు ఆశాజీవి. 'గతకాలము మేలువచ్చు కాలముకంటెన్' అని ఒక్కొక్కసారి నిరాశోపహతుడైనా 'ఉందిలే మంచి కాలం ముందు ముందునా' అని ఉత్సుకుడు కూడా కాకపోతే సార్థకంగా తన మనుగడ సాగించలేడు. ఇప్పుడు ప్రపంచమంతటా గొప్ప ఆధ్యాత్మిక జిజ్ఞాస నిశ్శబ్దంగా, నిరాడంబరంగా సాగుతున్నది. మానవాళి మంచిరోజులకిది శుభాశంసనం. ఉగాది నుంచి వసంత నవరాత్రాల ప్రారంభం.

ఇక శ్రీరామనవమి. 'ఇష్టదైవము నీవెరా' అని త్యాగరాజ స్వామి గానం చేసినట్లు తెలుగువారికి ఇష్టదైవం శ్రీరాముడే. ఇందుకు పోతన్న, భద్రాచల రామదాసు, సద్గురు త్యాగరాజ స్వామి కారణం కావచ్చు. ఆంధ్రదేశమంతటా ఊరూరా వాడా వాడా శ్రీరామనవమిని పరమోత్సాహంతో జరుపుకుంటారు. భద్రాచలంలో శ్రీరామ కళ్యాణం జరిగినంత వేడుకగా వైభవంగా భారతదేశంలో మరెక్కడా జరగదేమో! కాకినాడకు పది కిలోమీటర్ల దూరంలో గొల్లలమామిడాడ అనే చిన్నపల్లెటూరులో మహావైభవోపేతమైన శ్రీరామమందిరం ఉంది. అంత గొప్ప దేవాలయం భారతదేశంలో మరెక్కడా లేదనడం అతిశయోక్తి కాదు.

విశ్వప్రకాశం తన పాఠకులకు, అభిమానులకు, శ్రేయోభిలాషులకు
*ఉగాది, శ్రీరామనవమి* శుభాకాంక్షలందజేస్తున్నది.

# శుభాకాంక్షలు

"విశ్వప్రకాశం" పాఠకులకు, శ్రేయోభిలాషులకు, ప్రోత్సాహకులకు ధాతనామ నూతన సంవత్సర శుభాకాంక్షలు, తెలియపరుస్తున్నాను. మా సర్వార్థ సంక్షేమ సమితి విశ్వప్రకాశం మాసపత్రిక ప్రతినెలా మీకందించుచు, మీ అభిమానం పొందు ప్రయత్నం చేయుచు, ఈ సంస్థ సలుపు పలు కార్యక్రమాలు ఎప్పటికప్పుడు ఈ పత్రిక ద్వారా తెలియపరచుచున్నాను.

దేవాదాయ శాఖ కమీషనరుగారు, ఈ పత్రిక కొనుగోలు చేయుటకు యిచ్చిన కమెండేషను లేఖను రెండు తడవలు పత్రికలో ముద్రించి, మీకు తెలియపరిచాము. దాదాపు 400 దేవాలయాల E.O.ల పేరిట, నేటివరకు తప్పనిసరిగా పత్రిక పంపుచున్నాము. ఏ పది దేవాలయాల E.O.లు తప్ప మిగతా E.O.ల స్పందన నేటి వరకు కానరాలేదు. ఇలాటి ధార్మిక పత్రికలు ప్రతిదేవాలయమున కేతెంచు పాఠకులకెంతో ఉపకరించునని భావించి పంపుచున్నాను. దయచేసి యిప్పటికైనా దేవాలయాల E.O.లు ఇంతవరకు చందా చెల్లించనివారు వెంటనే కనీసం రెండు సంవత్సరముల చందా పంపమనవి.

అలాగే జిల్లా గ్రంథాలయ సెక్రటరీలకును, నెలనెలా పత్రిక పంపుచున్నాను. వారును దయతో వారి జిల్లాలోని గ్రంథాలయముల చిరునామాలతో పాటు ఆర్డరు పంపగలరని కోరుచున్నాను.

గత సెప్టెంబరు 1995లో ఢిల్లీలో జరిపిన కార్యక్రమాలపై సావనీరు, మరియు రెండు భాగములు "విశ్వజ్యోతి" ముద్రించినాము. ప్రథమభాగము రూ. 400=00, ద్వితీయ భాగము రూ. 200/- సావనీరు ఉచితం. వలయువారు సర్వార్థ సంక్షేమ సమితి, గాంధీనగర్, హైద్రాబాదుకు డబ్బుతోపాటు జాబువ్రాసి పొందగలరు. ఢిల్లీ కార్యక్రమాలకు సంబంధించి కొందరు సాహితీవేత్తలు, తమ అభిప్రాయములు పంపినారు. వాటిని ఈ క్రింద పొందుపరిచాము. గమనించగలరు.

ఈ నూతన సంవత్సరంలో తామెల్లరు సుఖసంతోషాలతో, భక్తి ప్రపత్తులు కలిగి, ధార్మికులై, మానవ విలువలపై, మానవసేవపై దృష్టిసారించి `కలి' యొక్క ప్రభావమునకు, తలవొగక, మేము జరుపబోవు మానవత, శాంతి సమైక్యతల సాధన కృషిని హర్షిస్తారని ఆశిస్తూ సెలవు.

*"సర్వేజనా స్సుఖినోభవంతు"*

**Dr. J. Bapu Reddy,** I.A.S.(Retd.)

Res. : Plot No.10, Road No 5,
Jubilee Hills, Hyderabad - 500 033.
Phone 238381

Off. : **GSAL (India) Ltd.**
6-3-802, Ameerpet, Hyderabad - 16

ఆత్మీయులు శ్రీ పి.వి. మనోహరరావు గార్కి,

నూతన సంవత్సరం మీకు, ఇతోధిక కీర్తి సంపదలు అందించాలని ఆకాంక్షిస్తున్నాను. మీరు నా పట్ల చూపుతున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. 'విశ్వప్రకాశం' నెలనెలా చదివి ఆనందిస్తున్నాను. మీరు ప్రత్యేకంగా పంపిన 'విశ్వజ్యోతి' సంచికలు విశ్వకిరణం సావనీర్ చేరినవి. ఎంతో విలువైన వ్యాసాలు నాకు ఎంతో ఆసక్తికలిగిన ఆధ్యాత్మిక చింతన అందులో చూసి స్పందించాను.

నూతన, మరియు సంక్రాంతి శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

సం/-
(జె. బాపురెడ్డి)

**RAMAKRISHNA MATH**
Ramakrishna Math Marg,
Domalguda, Hyderabad - 500 029
Phone : 633936, 633937

Dated 15.12.1995

Dear Sri Monohar Rao,

I have recevied your letter of 13th December along with copy of your Souvenir and 2 Volumes of Viswajyothi.

It is a great unifying cultural work that your Savvartha Sankshema Samithi is engaged in. I convey my love and best wishes to yor and the your colleagues for success in your noble efforts.

Yours in the Lord,
Sd/-
*(Ranganthananda)*

జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్, గోషామహల్,
హైదరాబాద్ - 500 012.
తేదీ 31.12.95

పూజ్యమూర్తులు ఆత్మీయులు శ్రీమనోహరరావుగారికి నమస్కారములు. మీరు దయతో పంపిన సర్వార్థ సంక్షేమ సమితి సంచిక, అన్యగ్రంథాలు రెండు అందాయి. అత్రతత్ర సద్యః పతనంచే అవి నన్ను చాలా ఆకర్షించాయి. విజాన ఖనులు అనిపించాయి. నేను నెమ్మదిగా చదువుకుంటాను. అనతికాలంలో మిమ్మల్ని కలుస్తాను - చాలా ఉత్కృష్ట కార్యక్రమం నిర్వహిస్తున్నారన్న విషయంలో సందేహం లేదు. మీకు నా హార్దిక అభినందనలు.

నా పుస్తకాలలో రెండు 1) కాలరేఖ, 2) రక్తరేఖ మీకు పంపిస్తున్నాను. దయచేసి స్వీకరించండి.

మీకు మీ పరివారానికి నా నూత్నవర్ష శుభాకాంక్షలు.

ఇట్లు
మీవిధేయుడు
సం/-
(శేషంద్రశర్మ)

---

**Dr. Giri Raj Shah**
I.P.S., F.R.G.S.

Dy. Inspector General of Police
and Dy. Commandant General
Home Guards, Lucknow : U.P.

Dated : December 29, 1995

My Dear Sri Rao Saheb,

I am exteramly grateful for your kind letter dated 13.12.95 enclosing there with Vol. I & II. of "VISHWAJOTHI". I am thakful for the published volumes along with "VISHWAKIRANAM" This is also to congratulate you about this outstanding publication of sterling merit. I hope that hese publications will go a long way in the annals of spiritual seminars and conferences.

With best wishes and regards & New year Grettings.

Yours Sincerely,

(Dr. Giriraj Shah)

# ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001

*అధ్యక్షులు,*
*జ్ఞానపీఠ పురస్కార గ్రహీత,*

**డా. సి.నారాయణ రెడ్డి**


తేదీ 3-1-96

మిత్రులు శ్రీమనోహరరావుగారికి నమస్కారం.

మీరు ఆప్యాయంగా పంపిన `విశ్వజ్యోతి' రెండు సంపుటాలు, `విశ్వకిరణం' ప్రత్యేక సంచిక నిన్ననే అందాయి. సంచికలో కొన్ని విలువైన బొమ్మలు ప్రచురించారు.

విశ్వజ్యోతి సంపుటాల్లోని వివిధ వ్యాసాల్లో ప్రధాన వస్తువు మానవత. ఉత్తమ సంస్కారమున్న ప్రతి పురుషుడు పురుషోత్తముడే. స్వభావతః ప్రతి మానవుడు అద్దంలా స్వచ్ఛమైన వాడే. సాంసారిక, వ్యావహారిక సంబంధి దుష్కర్మల ధూళిచేత కలుషితమవుతుంటాడు. ఆధ్యాత్మిక విజ్ఞానం ఆ ధూళిని శుభ్రం చేస్తుంది. అప్పుడు మానవ దర్పణం యథాపూర్వస్థితిలో మెరుస్తుంది. శ్వేతాశ్వతర ఉపనిషత్తులోని `అమృతస్య పుత్రాః'' అనే సూక్తి మనిషిలోని అమర్త్యాంశను ధ్వనింపజేస్తుంది.

మర్త్యుడుగా స్థూలమతికి గోచరించే మానవుడు అమృతస్థితిని ఎలా అందుకోవాలో ఈ సంపుటుల్లోని వ్యాసాలు సూచిస్తున్నాయి. పదార్థ పరిజ్ఞానంతో పాటు ఆత్మవివేకం పండించు కున్నపుడే మానవజన్మకు సార్థక్యం. సంపుటుల్లోని వ్యాసాలను చదివిన తరువాత నాకు కలిగిన స్పందనను పై నాలుగు మాటల్లో వ్యక్తీకరిస్తున్నాను. జ్ఞానాన్వేషులు పది కాలాలపాటు పదిలపరుచు కోవలసిన `విశ్వజ్యోతి' సంపుటులను ప్రచురించిన సర్వార్థ సంక్షేమ సమితికి, ప్రత్యేకించి మీకు నా హార్దికాభినందనలు.

ఇట్లు
సం/-
(సి. నారాయణరెడ్డి)

# శ్రీదత్తాత్రేయ స్తోత్రమ్

జటాధరం పాండురంగం శూలహస్తం కృపానిధిం।
సర్వరోగ హరం దేవం దత్తాత్రేయ మహంభజే॥

జగదుత్పత్తి కర్త్రేచ స్థితిసంహారహేతవే।
భవపాశ విముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

జరాజన్మ వినాశాయ దేహశుద్ధి కరాయచ ।
దిగంబరర దయామూర్తే దత్తాత్రేయ నమోఽస్తుతే॥

కర్పూరకాంతి దేహాయ బ్రహ్మమూర్తి ధరాయచ।
వేదశాస్త్ర పరిజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

ఆదౌ బ్రహ్మ మధ్యే విష్ణు రంతే దేవస్సదాశివః।
మూర్తిత్రయ స్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

దిగంబరాయ దివ్యాయ దివ్యరూపధరాయచ।
సదోదిత పరబ్రహ్మన్ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

అవధూత సదానంద పరబ్రహ్మ స్వరూపిణే।
విదేహ దేహరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

సత్యరూప సదాచార సత్యధర్మ పరాయణ।
సత్యాశ్రమ పరోక్షాయ దత్తాత్రేయ నమోఽస్తుతే॥

ఇదం స్తోత్రం మహద్దివ్యం దత్తప్రత్యక్ష కారకమ్।
దత్తాత్రేయ ప్రసాదశ్చ నారదేన ప్రకీర్తితమ్

*శ్రీదత్తాత్రేయాష్టకమ్*

# శ్రీదత్తాత్రేయ కవచమ్

శ్రీపాదః పాతుమే పాదే ఊరూసిద్ధాసనస్థితః ।
పాయాద్దిగంబరో గుహ్యం నృహరిః పాతుమేకటిం॥
నాభింపాతుజగత్స్రష్టా ఉదరం పాతుదలోదరః ।
కృపాళుః పాతుహృదయం షడ్భుజః పాతుమేభుజే॥

ప్రక్కుండీ శూల డమరు శంఖచక్రధరః కరాన్ ।
పాతుకంఠం కంబుకంఠః సుముఖః పాతుమే ముఖం॥
జిహ్వాంమే వేద వాక్పాతునేత్రం మే పాతుదివ్యదృక్ ।
నాసికాంపాతు గంధాత్మా పాతుపుణ్య శ్రీ వాః శ్రుతీ॥

లలాటం పాతు హంసాత్మాశిరః పాతుజటాధరః ।
కర్మేంద్రియాణి పాత్వీశః పాతుజ్ఞానేంద్రియాణ్యజః॥
సర్వాంత రోంతః కరణం ప్రాణాన్మేపాతుయోగిరాట్ ।
ఉపరిష్టా దథ స్తాచ్య పృష్ఠతః పార్శ్వతోగ్రతః॥

అంతర్బహిశ్చమాం నిత్యం నానా రూపధరోఽవతు ।
వర్జితం కవచేనా వ్యాత్ స్థానం మే దివ్య దర్శనః॥
వర్జితం కవచేనా వ్యాత్స్థానం మేదివ్య దర్శనః।
రాజతః శత్రుతో హింస్రాత్ దుష్ప్రయోగారితో ఘతః॥

ఆదివ్యాధిభయార్తి భ్యోదత్తాత్రేయస్సదాఽవతు ।
ధనధాన్య గృహక్షేత్ర స్త్రీ పుత్ర పశుకింకరాన్॥
జ్ఞాతీంశ్చపాతుమే నిత్యమనసూయానన్ద వర్ధనః।
బాలోన్మత్త, పిశాచాభోదువిట్ సంధిషు పాతుమామ్॥

భూత భౌతిక మృత్యు భ్యో హరిః పాతు దిగంబరః।
య ఏతద్దత్త కవచం సన్నహ్యాత్ భక్తి భావితః॥
సర్వానర్థ వినిర్ముక్తో గ్రహపీడా వివర్జితః।
భూతప్రేత పిశాచాద్యైః దేవైరప్య పరాజితః॥
భుక్త్వాత్రదివ్యాన్ భోగాన్ సఃదేహాన్తే తత్పదం వ్రజేత్॥

*ఇతి శ్రీదత్తాత్రేయ కవచమ్.*

# అనుభవతరంగిణి

(గత సంచిక తరువాయి)

*- శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ*

అది 1990వ సంవత్సరం. శరన్నవరాత్రులు. గుంటూరు పట్టాభిపురంలోని హరిహర దివ్యక్షేత్రంలో వేదసభ నేత్ర పర్వంగా జరుగుతున్నది. ఆ ఉత్సవం చూడటానికి అంకరాజు సుబ్బారావు, లలితాకుమారి దంపతులు వెళ్ళారు. వేదిక మీద ఘనాపాఠీలూ, ఆలయ ధర్మకర్తలు, పురప్రముఖులు కూచోని ఉన్నారు. వాళ్ళ మధ్య జడలు వ్రేలాడుతున్న ఒక దివ్యతేజస్వి, జరీఅంచు ఖద్దరు ధోవతి లుంగీగా చుట్టుకొని, ఒక భుజం మీద శాలువా మడత వేసుకొని, కళ్ళు మూసుకొని ధ్యానముద్రలో విలీనమై కూచొని ఉన్నారు. కార్యకర్తలు ఆయన్ను సంపూర్ణ దత్తావతారులు, శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగా సభకు పరిచయం చేశారు. శ్రీమతి లలితాకుమారి"ఆయన ఎక్కడుంటారో అడ్రస్ కనుక్కో" మని భర్తను కోరింది. ఆయన వెంటనే లేచిపోయి సభా కార్యకర్తలను వాకబు చేసివచ్చి "ఆయన ఇక్కడే కృష్ణనగర్‌లో ఉంటున్నారట! ఆకుల కోటీశ్వరరావుగారింట్లో" అని చెప్పాడు ఆమెకు.

ఆ తర్వాత ఆ భార్యాభర్తలిద్దరూ కలిసి మాస్టరుగారి దగ్గరకు వెళ్ళారు. సుబ్బారావును చూడటంతోనే మాస్టరుగారు ఆయన్ను పేరు పెట్టి పిలిచి, సాదరంగా ఆహ్వానించి, దగ్గర కూచోబెట్టుకొని " మీ పేరెట్లా తెలిసిందని ఆశ్చర్యపోతున్నారా? ఇక్కడ కూచున్న ఈ దేహాన్ని గుర్తుపట్టారా?" అని ప్రశ్నించారు. సుబ్బారావుకు ఎంత ఆలోచించినా గుర్తురాలేదు. తెల్లమొగం వేసి మాస్టరుగారి వైపు చూస్తుంటే "పూర్వాశ్రమంలో ఈ దేహం ధరించిన వ్యక్తి మీ దగ్గర పట్టాభిపురం హైస్కూల్లో చదువుకొన్నాడు. అప్పుడు అచ్చిరాజు సుబ్బారావు, మాణిక్యమూర్తి, బి.కే. విశ్వేశ్వరరావు మొదలైనవాళ్లు మీతోబాటు నాకు చదువు చెప్పారు. అంతమంది స్టూడెంట్సులో మీరు నన్ను గుర్తుపట్టక పోవటంలో ఆశ్చర్యం లేదు. మీరు నాకు బాగా గుర్తు. ఉత్తమ ఉపాధ్యాయుల్ని ఎప్పుడూ జీవితంలో శిష్యులు మరచిపోరు" అన్నారు మాస్టరుగారు. సుబ్బారావు ఆనందానికి అవధులు లేవు. ఎప్పుడో చాలాకాలం క్రిందట తన దగ్గర చదువుకొన్నవాడు ఈనాడు విశ్వగురు పీఠాన్ని అధివసించి దత్తావతారులుగా మన్ననలు పొందుతున్నా ఆ అతిశయం ఏమీలేక, ఒక సామాన్య విద్యార్థిలా

తనపట్ల ఎంతో అభిమానం, భక్తి, కృతజ్ఞత వెల్లడిస్తున్నారు! యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః! అన్న గీతాసూక్తిని అక్షరాలా నిజం చేసుకొన్నారని అనుకొన్నాడు. మాస్టరుగారిపట్ల ఆయనకు కలిగిన భక్తి ద్విగుణీకృతమైంది. అప్పటి నుంచి మాస్టరుగారి దగ్గరకు ఆ దంపతులు ప్రతిరోజూ విధిగా వెళ్ళుతుండేవాళ్ళు.

సుబ్బారావు దంపతులు లోగడ అనేక సమస్యలతో సతమతమైపోతూ, ఎంతోమంది దగ్గరకు పోయి, ఎంతో డబ్బు, ఎంతో సమయం వ్యర్థం జేసుకొన్నారు. చివరకు వాళ్ళకు విసుగుపుట్టి "ఛా! లోకంలో అంతో మోసగాళ్ళే! డబ్బు సంపాదనే వాళ్ళ పరమావధి. ఇంకా ఎవరి దగ్గరకు వెళ్ళగూడదు" అని లెంపలు వేసుకొన్నారు. వాళ్ళ ప్రారబ్ధం తీరి, ఎడారిలో పయనించే వాడికి ఒయాసిస్సులా, ఆకలిగొన్నవానికి అమృతంలా, ప్రవాహంలో కొట్టుకపోయేవాడికి పడవలా, చీకటిలో మెరుపు దివ్వెలా శ్రీవిశ్వయోగి విశ్వంజీ దర్శన భాగ్యం లభించింది. శారీరక మానసిక సంబంధమైన ఏ బాధ కలిగినా, ఏ సమస్య తలయెత్తినా వాళ్ళు వెంటనే మాస్టరుగారిని దర్శించేవాళ్ళు. "మరేం ఫరవాలేదు వెళ్ళిరండి" అని వాళ్ళకు బొట్టుపెట్టి ఆశీర్వదించి పంపించేవారు మాస్టరుగారు. వీళ్ళ కోరికలన్నీ తీరుతుండేవి. పూజాగృహంలో వాళ్ళ ఇలవేలుపైన వెంకటేశ్వరస్వామి పటం ముందు కూచుంటే ఆ పటంలో ఆ స్వామికి బదులు ఈ స్వామి - విశ్వయోగి విశ్వంజీ- వాళ్ళకు కనిపించేవారు. వాళ్ళు వెంకటేశ్వరస్వామి నామం స్మరించటం మాని, మాస్టరుగారు ప్రసాదించిన మహామంత్రాన్నే స్మరిస్తూండేవాళ్ళు. ఒకసారి ఈ విషయం వీళ్ళు మాస్టరుగారితో చెబితే "అందరిలో మనం ఉన్నాం. మనలో అందరూ ఉన్నారు. ఇలవేల్పును మరిచిపోరాదు- ఆయనకూ గురువుకూ భేదం లేదని గ్రహించాలి" అని తత్త్వోపదేశం చేశారు. సుబ్బారావు భార్య లలితకుమారి అంతగా చదువుకొన్నది కాదు. భాషా జ్ఞానం బొత్తిగాలేదు. అటువంటిది మాస్టరుగారి ఆశీస్సులతో, మాస్టరుగారిపై గల భక్తితో అద్భుతంగా ఎన్నో పాటలు పాడింది. మాస్టరుగారు ఆ పాటలను ఆమె చేత రోజూ పాడించుకొని విని ఆనందించేవారు. మాస్టరుగారి ఆశీః ఫలితంగా వాళ్ళ సమస్యలన్నీ తీరిపోయాయి. వాళ్ళ ఇద్దరి మగపిల్లలకూ ఉద్యోగాలు దొరికాయి. పెళ్ళిళ్ళు అయినాయి. ఇద్దరు ఆడపిల్లల్లో పెద్దమ్మాయికి పెళ్ళయింది. రెండో అమ్మాయికి సంబంధం కుదిరింది. ఆ పెళ్ళి చెయ్యటానికి గూడా ఆయన సన్నాహాలు చేస్తున్నాడు. ఉద్యోగ విరమణం చేసిన సుబ్బారావు మాస్టరుగారి సేవా సౌభాగ్యం పొంది ఈ నాడు ప్రశాంతచిత్తుడైనాడు.

ఒకసారి వాళ్ళ మనుమడు చి. రాఘవ కౌశిక్‌కు జాండిస్ (కామెర్లు)

వచ్చింది. ఆ పిల్లవాడికి మూడేళ్ళు. ఆ వ్యాధి చాలా తీవ్రమై ఆ పిల్లవాడు కోమాలోకి వెళ్ళాడు. వాళ్ళు ఆ అబ్బాయిని అరండల్ పేటలోని డా. సురేంద్రకుమార్ హాస్పిటల్లో చేర్చారు. డాక్టరుగారు ఆ పిల్లవాణ్ణి పరీక్షించి, పెదవి విరిచి " హోప్‌లెస్. ఈ పిల్లవాణ్ణి బ్రతికించటం మా వల్లకాదు. తీసుకవెళ్లండి" అన్నాడు. సుబ్బారావు దంపతులకు గుండె గుభేలుమంది. వాళ్ళు గాబరా పడుతూ మాస్టరుగారి దగ్గరకు వచ్చి " ఎట్లాగైనా మనుమణ్ణి బ్రతికించమని" ప్రాధేయపడ్డారు. వెంటనే మాస్టరుగారు హాస్పటల్‌కు వెళ్ళి, ఆ పిల్లవాణ్ణి చేత్తో పట్టుకొని దీవించి, తెలివి వచ్చేట్లు చేశాడు. ఆ పిల్లవాడు కోమాలోంచి బైటపడ్డాడు. లివర్ దెబ్బతినటం వల్ల ఆపరేషన్ చెయ్యాలన్నాడు డాక్టర్. ఆపరేషన్ చేయించాలంటే మూడువేలు కావాలి. వాళ్ళ దగ్గర అంత డబ్బులేదు. మాస్టరుగారే సుబ్బారావుకు ఆ మూడువేలిచ్చి ఆ అబ్బాయికి ఆపరేషన్ చేయించమన్నారు. 1990 జూన్ 5వ తేదీన ఆ పిల్లవాడికి ఆపరేషన్ జరిగింది. ఆ ఆపరేషన్ రోజు మాస్టరుగారు బెడ్ మీద నుంచి లేవలేదు. పడుకొన్నవారు పడుకున్నట్లే ఒరిగిపోయారు. ఆ పిల్లవాడి బాధనంతా తాము గ్రహించారు. ఆ మరునాడు మాస్టరుగారు బాబా గుడికిపోతే భక్తులు ఆయన కాళ్ళు కడిగారు. ఆ కడిగిన నీళ్ళు పసుపుపచ్చగా ఉండటం చూసి అంతా ఆశ్చర్యపోయారు.

ఒక నెల తర్వాత సుబ్బారావు దంపతులు తమ మనుమణ్ణి ఇంటికి తీసుకొని వచ్చారు. "ఆ పిల్లవాడికి ఏమీ ఘనపదార్థాలు తినడానికి పెట్టవద్దు" అని మాస్టరుగారు హెచ్చరించినా ఆ అబ్బాయికి తినడానికి ఒక బిస్కెట్టు ఇచ్చారు. అది లోపల ఇమడక వాంతి అయింది. మళ్ళీ కడుపునొప్పు వచ్చింది. డాక్టరు పరీక్షించి మళ్ళీ ఆపరేషన్ చెయ్యాలని చెప్పాడు. ఆ విషయం మాస్టరుగారికి వాళ్ళు చెప్పగానే ఆయన బాధపడి "ఆ అబ్బాయికి ఏమీ పెట్టవద్దంటే మీరు నా మాట వినలేదు. మళ్ళీ నొప్పి వచ్చింది. మరి ఆపరేషన్ చేయించక తప్పదు గదా! చేయించండి" అన్నారు. డాక్టరుగారు రెండవసారి ఆ అబ్బాయికి ఆపరేషన్ చేశారు. ఆ పిల్లవాడు ఆపరేషన్ చేసిన తర్వాత చాలా తెలివితోనే ఉన్నాడు. అటువంటివాడు ఆనాటి రాత్రి తెల్లవారితే యేకాదశి అనగా పరిస్థితి విషమించి కళ్ళు మూశాడు. రెండుసార్లు కోమాలోకి వెళ్లిన పిల్లవాణ్ణి కాపాడిన మాస్టరుగారు ఈసారి ఆ పిల్లవాణ్ణి ఎందుకు కాపాడలేదో! ఇది సామాన్యులకు అర్థంగాని విషయం. ఆనాడు తన ఆజ్ఞతో పరశురాముడు రేణుక శిరస్సు ఖండిస్తే, తిరిగి బ్రతికించిన జమదగ్ని, అంతటి శక్తిగల మహర్షి, తన ఆశ్రమానికి కార్తవీర్యార్జునుడు వచ్చి, తనను సంహరించబోతుంటే చూస్తూ మృత్యువును ఆహ్వానించటమేమిటి? తన

శక్తితో తన మరణాన్ని ఆపుకోలేడా? గాయత్రీ స్వరూపం, పరాశక్తి స్వరూపమైన రేణుకాదేవి తన భర్త ప్రాణాన్ని కాపాడుకోలేకపోయిందా? ఆనాడు పరీక్షిత్తు 7 రోజుల్లో సర్పదష్టుడై మరణిస్తాడని ముని కుమారుడు శాపం పెడితే పరీక్షిత్తు మోక్షం కోసం భాగవత శ్రవణం చేశాడనీ -ఆ భాగవతం వినాలని ఎందరో మునులు, దేవతలూ వచ్చారనీ భాగవతంలో చెప్పబడింది. ఆ వచ్చినవాళ్ళల్లో ఎవరికీ పరీక్షిత్తును సర్పదష్టుడు కాకుండా ఆపగల శక్తి సామర్థ్యాలు లేవని మనం భావించగలమా? మరి ఆ పని ఎందుకు చెయ్యలేదు? భగవంతుడు నిర్ణయించిన మరణాన్ని ఎవరూ ఆపలేరు. ఆపాలని ప్రయత్నమూ చెయ్యరు. ఆ నిర్ణయించిన గడువు ముందు వచ్చే మారకాలను (గండాలను) మాత్రం ఎవరన్నా అనుకుంటే తప్పించగలరు. అదీ వాళ్ళ ప్రారబ్ధం మంచిదైతేనే. మాస్టరుగారు కూడా ఎంతశక్తి సంపన్నులైనా తమ పరిధిలోనే తాము చేయగలిగింది చేయగలిగారని సుబ్బారావు దంపతులు అంత విచారంలోనూ కొంత ఊరట పొందారు. ఈనాడు ఆ దంపతులకు మాస్టరుగారి వాక్కు వేదవాక్కు. మాస్టరుగారితో ముందుగు చెప్పకుండా, మాస్టరుగారి ఆశీస్సులు పొందకుండా వాళ్ళు ఏ పనీ చెయ్యరు. ఆ కుటుంబానికి మాస్టరుగారు పిలిస్తే పలికే దైవమైనారు- ఈనాడు.

డాక్టర్ జి.యల్.యన్. శాస్త్రి పేరుతో గుంటూరు టి.జె.పి.యస్. కాలేజీలో భౌతికశాస్త్ర అధ్యాపకుడిగా, హోమియోపతి డాక్టరుగా, ఆధ్యాత్మిక తత్వరహస్య కోవిదుడుగా, వరల్డ్ టీచర్స్ ట్రస్టు (జగద్గురు కేంద్రం) గుంటూరు శాఖకు ప్రధాన కార్యకర్తగా చెలామణి అవుతూ, ఎంతో ప్రఖ్యాతి వహించిన శ్రీ గొర్తి లక్ష్మీనారాయణశాస్త్రి మాస్టర్ ఈ.కే. శిష్యుడు. మాస్టరు ఈ.కే. దేహత్యాగానంతరం 1987లో- మాస్టరుగారి దర్శనం ఆయనకు లభించింది. అంతవరకూ తమ గురువుగారి వియోగంతో పరితపించిపోతున్న ఆయన హృదయంపై ఒక్కసారి అమృత వృష్టి కురిసినట్లైంది. మాస్టరుగారంటే సాక్షాత్తూ తమ గురువుగారు ఈ.కే.యేననీ. వారిప్పుడు ఈ మాస్టరుగారు రూపంగా కనిపిస్తున్నారనీ ఆయనకు అనిపించింది. మాస్టరుగారిపై ఎనలేని భక్తి ప్రపత్తులు రేకెత్తినవి.

1987వ సంవత్సరంలో- మాస్టరుగారు రైలుపేట గదిలో ఉంటున్నప్పుడు వారిపేరు విని, సతీసహితంగా వారిని దర్శించడానికి వెళ్ళాడు. ఆ సమయంలో మాస్టరుగారు తమ గదిలో పూజ చేస్తున్నారు. ఆనాడు ఆయన మొట్టమొదటగా మాస్టర్ ఈ.కె.ను చూడాలని వెళ్ళినప్పుడు కూడా ఆయన ఇట్లాగే పూజ చేస్తూ శాస్త్రిగారికి దర్శనమిచ్చారు. ఈనాడు గూడా ఆ సన్నివేశమే పునరావృత్తం కావటం ఆయనకు ఆశ్చర్యాన్ని కలిగించింది. మాస్టరుగారు ఆయన్ను చూచి

"శాస్త్రిగారూ! రండి! కూచోండి!" అని సవాత్సల్యంగా ఆహ్వానించారు. శాస్త్రి దంపతులకు మాస్టరుగారిని చూస్తుంటే మాస్టర్ ఈ. కేసును చూస్తున్న అనుభూతే కలుగజొచ్చింది. అదే చూపు! అదే పిలుపు! అదే పలుకు! అదే చెరుగని చిద్విలాస ముద్ర వదనంపై. వాళ్ళ శరీరం పులకించింది."సందేహం లేదు. ఆయనే ఈయన!" అనిపించింది వాళ్ళకు. అంతే! దగ్గరకు వచ్చిపోతూ మాస్టరుగారి అభిమానాన్నీ, వాత్సల్యాన్ని చూరగొన్నారు.

1984లో మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్యగారు శాస్త్రిగారి అబ్బాయి చి. శివసుందర్‌కు గర్భాష్టకంలో ఉపనయం జరిపించాలని భావించి ఆ అబ్బాయితో బాటు మరో నలుగురికి విశాఖపట్టణంలో జగద్గురుపీఠం తరఫున సామూహిక ఉపయనాలు జరిపించారు. ఇట్లా మాస్టర్ ఈ.కే. సామూహిక ఉపనయనాలకు ఆనాడు శ్రీ కారం చుడితే అప్పటి నుంచి ప్రతియేటా జగద్గురు పీఠం గుంటూరు శాఖ తరఫున శ్రీరామనామ క్షేత్రంలో సామూహిక ఉపనయనాలు ఆయన జరిపిస్తూ వచ్చారు. మాస్టరుగారి పరిచయమైన తర్వాత శాస్త్రిగారు 1987 మేలో మాస్టరుగారి అధ్యక్షతన ఆ సామూహిక ఉపనయనాలు జరిపించారు. అట్లా జరిపించటానికి ఒక విచిత్ర పరిస్థితి అనూహ్యంగా తోడ్పడింది. మేలో ఆయన సామూహిక ఉపనయనాలు జరిపించాలని అనుకొంటున్నంతలో ఆయన తల్లిగారు స్వర్గస్థురాలైంది. అందుకోసం ఆయన బందరు వెళ్ళవలసి వచ్చింది. మాస్టరుగారు దగ్గరకు వచ్చి, తాను తలపెట్టిన కార్యక్రమానికి భంగం లేకుండా జరిపించవలసిందిగా ప్రార్థించారు. మాస్టరుగారు ఓ.కే. అని - సర్వ బాధ్యతలు తాము స్వీకరించి, శాస్త్రిగారి లేని లోపం కనిపించనీయకుండా వైభవంగా ఆ సామూహిక ఉపనయనాలు జరిపించారు. ఆ తర్వాత రైలుపేటలో తమ గదిలో శాస్త్రిగారి చేత లలితా సహస్ర నామాల మీద ఉపన్యాసాలిప్పించారు.

1989వ సంవత్సరం దసరాలో గుంటూర్లో ప్రముఖ న్యాయవాది శ్రీ దేశిరాజు పార్థసారథి ఇంట్లో లలితా సహస్రనామా పారాయణం, కుంకుమ పూజలు శ్రీశాస్త్రి దంపతుల నిర్వహణలో జరుగుతున్నవి. శాస్త్రిగారి ఆహ్వానం అందుకొని మాస్టరుగారు శ్రీఆకుల కోటేశ్వరరావుగారి ధర్మపత్ని శ్రీ మతి ఈశ్వరిని వెంట దీసుకొని అక్కడికి వెళ్ళారు. ఈశ్వరి శాస్త్రిగారిని చూసి "లలితా సహస్రనామాలు - వాటి అంతరార్థం" అనే విషయాన్ని గురించి విశ్వమందిరంలో (1988వ సంవత్సరంలో మాస్టరుగారు తమ గది ఖాళీ చేసి శ్రీకోటేశ్వరరావుగారి నిలయాన్ని విశ్వమందిరిగా చేసుకొని అక్కడ నివసించడం జరిగింది) ఉపన్యసించమని కోరితే మాస్టరుగారి సమక్షంలో ప్రసంగించే మహాభాగ్యంకంటే కావలసిందేముందని సరేనని వప్పుకొన్నాడు.

డిసెంబరులో దత్త జయంతి కాగానే జనవరి 3 నుంచి ప్రారంభిద్దామనుకొని ఆరోజు ఆ విషయం అక్కడున్న వాళ్ళందరికి తెలియజేశాడు. అట్లా జనవరి నుంచి ప్రతి మంగళవారం సాయంత్రం ఆయన తన ఉపన్యాసం విశ్వమందిరంలో ఇచ్చేవాడు. 1989 జనవరి నుండి వరుసగా మూడేళ్ళపాటు ఆ ఉపన్యాసాలు కొనసాగాయి. శాస్త్రిగారు తమకు హోమియోపతి వైద్యం మీద ఉన్న అభిమానాన్ని పురస్కరించుకొని ప్రతి యేటా సామ్యూల్ హానిమన్ జన్మదినోత్సవంతో బాటు మాస్టరు సి.వి.వి., మాస్టర్ ఈ.కే.ల జన్మదినోత్సవాలు గూడా జరిపిస్తూండేవాడు. మాస్టరుగారి పరిచయం లభించినప్పటి నుండి ఆఉత్సవాలను మాస్టరుగారి అధ్యక్షతనే ఆయన జరిపించటం మొదలుపెట్టారు.

మాస్టరుగారి దగ్గరకు వచ్చే వాళ్ళల్లో చాలామంది కోరికలతో, బాధలతో కూడి వాటి ఉపశమనార్థం వచ్చేవాళ్ళే. శాస్త్రిగారు మాత్రం మాస్టరుగారి ప్రేమతత్వం, సనాతన ధర్మం మీద వారికి గల మక్కువ మనిషిలోని ప్రత్యేకతను గమనించి, దాన్ని ప్రోత్సహించే తీరు ఇవన్నీ చూచి ఆకర్షితుడయ్యాడు. మనిషి ఎంత దుర్మార్గుడైనా అతనిలోని మంచితనాన్ని చూసి, ప్రేమతో దగ్గరికి తీసుకొని అతణ్ణి సంస్కరించాలనే మాస్టరుగారి చేతలు శాస్త్రిగారిని సమ్మోగ్ధుణ్ణి చేసి, సరిగ్గా ఇదే తత్వాన్ని ఆయన మాస్టర్ ఈ.కే.లో సందర్శించాడు. మాస్టరుగారికి పూర్వాశ్రమంలో గురువైన అంకరాజు సుబ్బారావుగారి మనుమడికి పసికర్లు వచ్చినప్పుడు ఆ పిల్లవాడి మీద మాస్టరుగారు చూపిన వాత్సల్యం, తన భక్తులపై చూపించే ఆ ఆదరాభిమానాలు ఆయన హృదయంపై చెరగని ముద్ర వేశాయి. మాస్టరుగారు స్వయంగా ఆ పిల్లవాణ్ణి హాస్పటల్లో చేర్పించటం, వాళ్ళ దగ్గర డబ్బు లేకపోతే ధన సహాయం చేయటం ఇవన్నీ కళ్ళారా చూచి - తనను నమ్మిన వాళ్ళను మాస్టరుగారు ఎట్లా ఆదుకొంటారో అర్థం చేసుకొన్నాడు. మాస్టరుగారు పదే పదే చెప్పటమే కాదు. ప్రతి క్షణం తమ చర్యల ద్వారా నిరూపించి చెబుతున్న Self confidence (ఆత్మవిశ్వాసం) మరింతగా శాస్త్రిగారిని ఆకర్షించింది.

శాస్త్రిగారి శ్రీ మతికి తల్లిదండ్రులు పెట్టిన పేరు విష్ణుప్రియ. మాస్టర్ ఈ.కే. ఆమెలోని మధుర మీనాక్షిదేవి అంశను చూచి ఆమెకు మీనాక్షి అని పేరు పెట్టారు. ఆమెను ' అమ్మాయి' అని ఆయన పిలుస్తూ ఉండేవారు. మాస్టరుగారు కూడా ఆమెను ' అమ్మాయీ' అని పిలుస్తుంటే ఆమెకూడా మాస్టర్ ఈ.కే తమకు భౌతికంగా దూరమయ్యారనే భావనను దూరం చేసుకొంది.

"ప్రతి వ్యక్తి దేహబలం, మానసికబలం, అర్థబలం, సంఘబలం, ఆధ్యాత్మిక బలం సంపాదించాలి. తన కుటుంబాన్ని విస్మరించరాదు. తమ బాధ్యత తను మరువరాదు. అదుపు పొదుపు పాటించాలి. ఆధ్యాత్మికత భౌతికాన్ని పరిపుష్టం చేసుకొనేందుకేగాని నిర్లక్ష్యం చేయటానికి కాదు" ఈ మొదలైన మాస్టరుగారి సిద్ధాంతాలు తమ అభిప్రాయాలు కూడా కావటంతో మరింత మాస్టరుగారికి ఆయన దగ్గరయ్యాడు.

శాస్త్రిగారికి తనదంటూ ఒక ఇల్లు ఏర్పడలేదు. గుంటూర్లో అద్దె ఇళ్ళల్లో వుంటూ అవస్థపడుతుండేవారు. మాస్టరుగారు ఆయనపై ప్రత్యేకశ్రద్ధ తీసుకొని ఎక్కడైనా అనువైన ఇల్లు దొరికితే చూడండని గోగినేని కనకయ్య, మాధవపెద్ది రాధాకృష్ణమూర్తి మొదలైనవాళ్ళతో చెప్పేవారు. ఈశ్వరీ, శాస్త్రిగారు వాళ్ళ కార్లల్లో ఎక్కి ఎక్కడన్నా ఇల్లు ఉన్నదని తెలిస్తే పోయి చూసి వచ్చేవాళ్ళు. శాస్త్రిగారి స్వంత విషయాలు తమ స్వంత విషయాలుగా పరిగణించి మాస్టరు ఈ.కె. ఎంతగా శ్రద్ధ తీసుకునేవారో మాస్టరుగారు కూడా అటువంటి శ్రద్ధ, తీసుకోవటం, తన కుటుంబంయొక్క అభివృద్ధిని ఆకాంక్షిస్తు ఉండటం చూస్తున్నప్పుడెల్లా మాస్టరుగారు ఆయనకు మాస్టర్ ఈ.కే.గానే కనిపించేవారు.

ఎల్లాగైతేనేం బ్రాడీపేటలో ఒక ఇల్లు ఆయనకు నచ్చింది. 1990 మే 7వ తేదీన రిజిస్ట్రేషన్. ఆ సమయంలో గుంటూర్లో విపరీతమైన వర్షం ఎడాతెరిపీ లేకుండా కురవటం మొదలుపెట్టింది. రిజిస్ట్రేషన్ ఎట్లా జరుగుతుందోనని ఆయన సందేహిస్తుంటే మాస్టరుగారు 'అనుకున్న సమయానికి అనుకున్న పనులన్నీ నిర్విఘ్నంగా జరుగుతవి' అని ఆశీస్సులిచ్చారు. అనుకొన్న ప్రకారం అంతవర్షంలో మే 7వ తేది శాస్త్రిగారి రిజిస్ట్రేషన్ పనులు పూర్తి అయ్యాయి. జూన్ 13వ తేదీ నూతన గృహ ప్రవేశం చేశారు శాస్త్రిగారు. మాస్టరుగారి దివ్యసమక్షంలో - దివ్యాశీస్సులతో. ఆరోజు మాస్టరుగారు వారి నూతన గృహంలో అందరు అతిధులతోపాటు తామూ విందులో పాల్గొని శాస్త్రిగారి భక్తిహృదయంతో ఇస్తున్న భోజనాన్ని ఆప్యాయంగా స్వీకరించారు. ఎక్కడా ఏ ఫంక్షన్‌లోనూ భోజనం చేయకుండా ఉండటమేగాదు, రోజూ ఏ కాఫియో, కొబ్బరినీళ్లో ఆహారంగా తీసుకొంటూ వుండే మాస్టరుగారు శాస్త్రిగారి భక్తిపాశాలకు కట్టువడి వాళ్ళ ఇంట్లో అట్లా సంతృప్తితో భోజనం చెయ్యటం చూచేవాళ్ళందరికీ ఆశ్చర్యహేతువైంది. అప్పుడేకాదు, శాస్త్రిగారి అమ్మాయి చి. శశికళ వివాహ సమయంలో కూడా మాస్టరుగారు వారి గృహంలో శాస్త్రి దంపతులు ప్రేమ పూర్వకంగా పెట్టిన భక్తిభోజనాన్ని స్వీకరించారు. మాస్టరుగారి విశ్వరూపాన్ని సందర్శించిన, మాస్టరుగారి దివ్యానుగ్రహానికి పాత్రులైన శాస్త్రి దంపతులు ధన్యులు.

*(సశేషం)*

# శ్రీ సాయి విశ్వదత్తస్తుతి

- శ్రీగోపాలకృష్ణ `కాశ్యప'

శ్రీవిశ్వప్రభ లోక సంతమసముంజెండాడ నిండారు ప్ర
జ్ఞా విష్కారము సర్వలోక హృదయ స్పందంబు గల్గింప స
ద్భావ ప్రాభవ మెల్లడ న్వెలయ నుద్యద్భక్తి కేల్మోడ్తు ద
త్తా! విశ్వేశ్వర విశ్వవంద్య మము చెంతం జేరి రక్షింపుమా!

పుక్కిటఁ బట్టి నీరుమిసి పొందుగ మందిర మందు దీపముల్
చక్కవెలుంగజేసితివి సాయి! హృదంతర తామసంబు స
మ్యత్కృప బారద్రోలి సుసమాహిత వృత్తిని గూర్చి జ్ఞానముం
దక్కగ జేయుమయ్యా సుఖదంబభయంబు నొసంగి ప్రేమతో!

భక్త జనంబులన్మనుప వచ్చిన సచ్చరితుండ వీవు - నీ
శక్తికి మించనట్టి యొక చల్లని చూపున జూడుమంతియే
ప్రాక్తన కర్మపుంజపు ప్రభావ మభావమగున్ మహాత్మ సు
వ్యక్తము నీ మహత్త్వము నభంబు శుభంబు నెఱుంగ నట్టిడన్

ఎందర కెన్ని గూర్చితివొ యెంద రకెన్ని విధాల రూపులన్
గందరగోళము ల్దులిపి కన్నుల పండువు సేసితో నినుం
గొంద రు సాయిగా మ రియు గొంద రు దత్తునిగా భజించగా
గొంద రు నిష్టదైముగ గొల్తురు షిర్డినివాస భక్తిమై

ఓయి మహానుభావ కరుణోదధి వీవొగి భక్తి భావనన్
దోయిలి యొగ్గి వేడుదు సుదుస్తర సంసృతి దాటలేను నీ
వే యొక కంట జూచి పడవేయుము గట్టుకు కర్ణధారివై
సాయి! నినుం భజించెద ప్రసన్నమనస్కత నుద్ధరింపుమా

తెలియని దెంతయో గలదు తెల్లమ యుల్లములో నె రుంగుదున్
తెలిసినవాని యట్లు గురుతింపును పొందితి నెంతొ కొంతయే
తెలివిని జన్మకర్మముల దింపుడగల్గము లొనొ యద్దియే
తెలివి తినంగ గట్టుటకు దీనత బాపున దొక్క తెల్వియా?

# అమ్మ భక్తులకొక శుభవార్త



జయహోమాతా శ్రీఅనసూయా!
రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి!!

# శ్రీఅనసూయేశ్వరాలయంలో సహస్ర ఘట క్షీరాభిషేకం

మార్చి 28, 1923న పరాశక్తి అయిన అమ్మ మానవాకృతిలో అవతరించి, 62 సంవత్సరాలు ఈ అవనిని పునీతం చేసి తన పార్థివశరీరాన్ని జూన్ 12, 1985లో పరత్యాజించింది.

జిల్లెళ్ళమూడి అమ్మగా వెలుగొంది, ప్రేమయొక్క విరాట్ స్వరూపాన్ని లోకానికి తెలియజేసి, దైవాన్ని అందరికీ యోగులకూ, భోగులకూ, జ్ఞానులకూ, అజ్ఞానులకూ, కలవారికీ, లేనివారికీ, అన్ని మతాలవారికి సుబోధకరం చేసిన కాలస్వరూపిణి మన అమ్మ.

" మీ అందరినీ నేనే కని మీ తల్లులకు పెంపుడిచ్చాను " అని తన విశ్వజనీన మాతృత్వాన్ని బహిర్గతం చేసింది.

తినకపోతే మీరు చిక్కిపోతారు మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను అని తన మాతృవాత్సల్యాన్ని వెదజల్లింది.

" నేను నేనైన నేను', 'మీదంతా నేనేమీరంతా నేనే ",ఇదంతా నేనే' అంటూ తన విశ్వతాదాత్మ్యాన్ని, తన సహజ అద్వైత స్థితిని గుర్తించేటట్లు చేసింది

విశ్వమై, పరమాత్మయై, తానేకాలమై, అనిర్వచనీయమై కూడా, మన అందరితో తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ, అందరికీ దగ్గరగా వుంటూ తన అకారణ కరుణా ప్రవంతిని రుచి చూపుతూ మమతల మహిమల వెల్లువలో లోకాన్ని ముంచెత్తిన 'అమ్మ ' తన పార్థివశరీరాన్ని పరిత్యజించి తేజోస్వరూపిణి అయింది.

అమ్మకు కాలాలు లేవు. ' తానే అన్నది ' నాకు అంతా వర్తమానమే ఇన్ని ' కాలాలు లేవు ' అని. అందుకని అమ్మ ఎప్పుడూ ఉంది.

1996 జూన్ 12వ తేదికి యింతకాలం పరిమితరూపంలో కనిపించిన అమ్మ అనంతశక్తి స్వరూపంగా తన సహజస్థితిని పొంది 11 సంవత్సరాలు పూర్తయి 12వ సంవత్సరం వస్తుంది. అనంతకాల ప్రవాహంలో 12 సంవత్సరాల కాలం గణనీయం కాకపోయినా సాధకుడి జీవితంలో అది గణనీయమైన కాలమే.

ఈ సందర్భంలో బుద్ధి ప్రచోదిని అయిన అమ్మ ఒక ప్రేరణ కలిగించింది. ఆ ప్రేరణననుసరించి 1996 జూన్ 12వ తేదీన అమ్మకు సహస్ర ఘట క్షీరాభిషేకం చేసుకొందామని ఒక సంకల్పం కలిగింది

అమ్మ శివశక్త్యైక్యరూపిణి అమ్మకు అభిషేకం అంటే ప్రీతి. క్షీరాభిషేకం అంటే పరమప్రీతి.

జిల్లెళ్ళమూడిలోని అమ్మ పవిత్రదేహాన్ని నిక్షిప్తం చేసుకొని వేవెలుగులతో విరాజిల్లుతున్న అనసూయేశ్వరాలయంలో ఈ అభిషేకాన్ని జరపాలని సంకల్పం

ఈ పవిత్ర కార్యక్రమాన్ని నిర్వహించేందుకు అమ్మ సహస్రఘట క్షీరాభిషేక సమితి ఏర్పాటు అయింది. ఇందుకు ప్రణాళికా రచన జరుగుతున్నది

ఈ అరుదైన పుణ్యకార్యక్రమంలో అందరూ ఉత్సాహంగా, మనః స్ఫూర్తిగా ముందుకు వచ్చి పాల్గొని అమ్మ పరమకృపకు పాత్రులు కావలసిందిగా మనసార కోరుతున్నాము.

ఈ కార్యక్రమ నిర్వహణలో పాల్గొనదలచిన ప్రతి ఒక్క సభ్యుడి నుండి రూ.648/ విరాళంగా స్వీకరించటానికి నిర్ణయింపబడింది. ఈ కార్యక్రమ నిర్వహణలో సుమారు ఒకవేయి మందిని భాగస్వాములుగా చేయాలని సంకల్పం

ఈ క్షీరాభిషేకంలో పాల్గొనదలచిన సోదరీసోదరులు ఈ క్రింది చిరునామాకు డ్రాఫ్టుల రూపంలోకాని, చెక్కుల రూపంలోకాని, మనీ ఆర్డర్ ద్వారాకాని పంపవచ్చును.

చెక్కులు, డ్రాఫ్టులు అమ్మ సహస్రఘట క్షీరాభిషేక సమితి పేర పంపవచ్చును.

**P.S.** సోదరీ సోదరులందరి చిరునామా మా వద్ద లేనందున మీకు తెలిసిన చిరునామాలు మాకు పంపవలసిందిగా విజ్ఞప్తి.

**రాచర్ల లక్ష్మీనారాయణ**
కన్వీనరు
సహస్రఘట క్షీరాభిషేక సమితి

*పంపవలసిన చిరునామా :*
**రాచర్ల లక్ష్మీనారాయణ,**
డో.నెం. 4-5-26/18; 4/1
విద్యానగర్, గుంటూరు - 522 007
ఆంధ్రప్రదేశ్

# జిల్లెళ్ళమూడి అమ్మ

లోకంలో అమ్మకన్నా అభయ ప్రదాత ఎవరున్నారు? ఆనందదాయిని ఎవరున్నారు? అన్నీ ఉన్నట్లే, అమ్మ అంటే కల్పవృక్షమూ, కామధేనువూ. అమ్మ చందమామ ఇచ్చే సంతోషాన్ని ఇస్తుంది. అమ్మకన్నా దైవం లేదు. అమ్మలేకపోతే తనువేలేదు. మనువేలేదు. సృష్టిలేదు. కరుణామృత తృష్టి లేదు.

ఎప్పుడైనా ఏదైనా ఉద్వేగం కలిగితే కాలిబొటనవేలికో చేయి చిటికెన వేలికో చిన్ననొప్పి కలిగితే అమ్మా అంటాము. ఏదైనా కష్టంలోంచి గట్టెక్కితే అమ్మయ్యా అంటాము. అంటే తల్లీ, తండ్రీ నీవేనమ్మా అని! తల్లి సహాయం లేకపోతే తండ్రి ఏం చేయగలడు? ఆద్యశక్తి అండలేకపోతే సచ్చిదానంద పరబ్రహ్మం, జడుడూ నిష్క్రియుడూ అని రామకృష్ణ పరమహంస చెప్పలేదా?

సరిగా ప్రాజ్ఞత తెలియనిరోజుల్లో చదివిన కథ ఒకటి జ్ఞాపకం వస్తున్నది. అమ్మ అయిదేళ్ళ బుడతణ్ణి వెంటబెట్టుకొని ఒక తిరుణాలకు వెళుతుంది. ఓహ్! అక్కడ ఒకటే కోలాహలం. రకరకాల అంగళ్ళు, తినుబండారాలమ్మే కొట్లు, రంగురాట్నాలు, ఆటవస్తువులమ్మే వారి సందడి. ఒకటే జనసమ్మర్థం. అమ్మ ఏదో కొట్టుదగ్గర తనకు కావలసిన వస్తువులు బేరం చేస్తున్నది. దూరానా కోతులాడించటమో, రంగులరాట్నం గిర్రున తిరగటమో చూసి పిల్లవాడు తల్లి చెయ్యి తప్పించుకొని వెళ్ళాడు. తల్లి తన పక్కనే వాడు ఉన్నాడనుకొంది. ఎలానో అలా విడిపడ్డాడు. తల్లి ఆందోళనతో ఆర్తితో పిల్లవాడు ఒకవైపు వుంటే ఇంకోవైపు వెతకటానికి పోయి గుంపులో కలిసిపోయింది. ఇక్కడ పిల్లాడు కాసేపు వినోదం చూసి అమ్మ గుర్తు రావటంతో బావురుమని యేడ్చాడు. అంగలార్చాడు. వెక్కి వెక్కి యేడ్చాడు. బిక్కు బిక్కుమంటూ ఆక్రందిస్తున్నాడు. అక్కడున్న ఆడామగా పెద్దాచిన్నా అమ్మ పేరేంటి నాయనా, ఏ అంగడి దగ్గర తప్పిపోయినావు. అమ్మెటు వెళ్ళింది అంటే చెప్పడు. చెప్పలేడు. ఒకటే యేడుపు. గుక్క తిప్పుకోకుండా. ఎత్తుకున్నారు. బుజ్జగించారు. కన్నీరు తుడిచినారు. అమ్మదగ్గరకు తీసుకెళ్తాం, ఏడవకు అని సర్దిచెప్పారు. వాళ్ళిచ్చిన వస్తువులవైపు ఒక్క క్షణం నవ్వు వ్యాముఖంతో అనగా ఆసక్తితో చూసేవాడు పిల్లవాడు. చేతిలో పట్టినంతవరకు తీసుకొనేవాడు. నోటిలో పట్టినంత వరకు పెట్టుకునేవాడు. కానీ మళ్ళీ

మరుక్షణమే అమ్మా అని ఏడ్చేవాడు. అమ్మ కావాలనేవాడు. ఇంకేమీ వద్దనేవాడు. ఒక పెద్ద మనిషి పిల్లవాణ్ణి ఎత్తుకోగా నలుగురైదుగురు అతడి చుట్టూ చేరి అమ్మకోసం వెతుకుతున్నారు. పిల్లవాడు అమ్మా అమ్మా అంటూ వెతుకుతున్నాడు. బెక్కుతున్నాడు. ఏది ఇచ్చినా ఏది తెచ్చినా, ఎంతగా ఏడవకుండా ఊరుకోబెడదామనుకున్నా అమ్మా అమ్మా అని అడిలిపోతూనే ఉన్నాడు. ఇదీ కథ. ఈ కథపేరు `ది లాస్ట్ చైల్డ్'. అంటే తప్పిపోయిన పిల్లవాడు'. అయితే జిల్లెళ్ళమూడి అమ్మ తానే పిల్లల్ని వెతుక్కొంటూ వచ్చింది.

శ్రీరామకృష్ణ పరమహంస కూడా ఇటువంటి దృష్టాంతమే చెబుతుండేవారు. వింత వింత వస్తువులిచ్చి ఆటబొమ్మలిచ్చి అంగడి మిఠాయి తెచ్చి పిల్లవాడిని కాసేపే మరిపించగలవు. అంతేకాని వాడికి అమ్మ గుర్తు వచ్చిందా, అమ్మ ధ్యానం కలిగిందా అమ్మకోసమే ఏడుస్తాడు. ఊరుకోడు. అమ్మ వచ్చి ఎత్తుకొన్నదాకా మారాం చేస్తాడు. అదుగో అటువంటి మంకుపట్టు కావాలి. అటువంటి ఆర్తి కలగాలి. అట్లా ఆక్రంధించాలి. అప్పుడు అమ్మ ఎందుకు కనపడదు? తప్పకుండా కనపడుతుంది అంటారు శ్రీరామకృష్ణులు.

సాధకుడు ఐదేళ్ళ బాలకుడి వంటి స్వభావంకలవాడై ఉండాలి. అటువంటి బాలకుడికి స్త్రీ పురుష వివక్ష తెలియదు. అసూయ ఉండదు. లోకంలోని మాలిన్యాలేమీ అంటవు. అంతటా తననే చూసుకుంటాడు. అద్దంలో తనను చూసుకుని ఆనందించినట్లే సంబర పడిపోతాడు. ప్రపంచాన్ని చూసి, సర్వచైతన్యమూ తానేనని తన్ను తాను తానులోని తనేనని తెలుసుకుంటాడు. ఆత్మ విదురుడికి లోకం మిధ్యకాదట. భగవన్మయమట. అతణ్ణి మాయ అంటదు అని పరమసిద్దులు, పరమహంసలు, పరమభక్తులు ఆత్మదర్శనం చేశారు. అదే లోకానికి చెప్పారు:

తనవారూ,. తనదగ్గర బంధవులూ, పిల్లాపాపా ఇల్లూ ఇల్లాలు ఊరు వూరివారూ వీరందరిపై, వీటన్నిటిపై తగులమూ, మమకారమూ, మమత్వమూ చూపటమూ వీటన్నిటిపై బంధాలు గట్టిగా పెనవైచుకొనటమూ మాట అంటారని అయితే దీనినే సర్వజగత్తుపై సమస్త చరాచర ప్రవృత్తిపై లోకమంతటిపై చూపితే, అలాటి తాదాత్మ్యం నిలుపగలిగితే ఆ తత్త్వాన్ని ఆ భావాన్ని దయ అంటారనీ శ్రీరామకృష్ణ పరమహంస భగవాన్ శ్రీరమణమహర్షి చెప్పారు దయకూ దైవానికీ దగ్గర సంబంధం ఉంది. విడదీయరాని బంధం ఉంది. ఆ దయ నేర్పించటానికే, ప్రేమభక్తి బోధించటానే ఆత్మదర్శనులు

అవతరిస్తుంటారని భారతీయుల ప్రగాఢ విశ్వాసం.

ఆదిశంకర భగవత్పాదులు, త్రైలింగస్వామి, భగవాన్ శ్రీరమణమహర్షి, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీస్వామి జ్ఞానానంద వంటి విశిష్ట అవతారమూర్తులు ఈ లోకంలో లీలామానుష విభవం సాగించడానికి రావటం ఎందుకు? ప్రతి శతాబ్దంలోనూ ప్రతి కాలంలోనూ ఇటువంటి మహనీయులు భారతదేశ ఆధ్యాత్మిక సంస్కృతిలో కనపడుతూనే ఉన్నారు. ఈశ్వరతత్త్వాన్ని లోకానికి ఎరుకపరచటానికి, పరతత్త్వం పట్ల ప్రేమభక్తి నేర్పించటానికీ ఇటువంటి విశిష్టవ్యక్తులు అవతరిస్తుంటారని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు. అంతేకాదు ఎవరైతే అదృష్టవంతులు వీరిని దర్శించుకుంటారో వారు భగవంతుణ్ణి దర్శించినట్లే అని కూడా శ్రీరామకృష్ణులు అన్నారు. ఎవరికైతే ఆ భాగధేయం ఉన్నదో వాళ్ళు జిల్లెళ్ళమూడి తప్పక వస్తారని అమ్మకూడా అన్నది. ఇంతకూ అమ్మెవరు? ఆమెందుకు మనందరి మధ్యకు వచ్చింది. శ్రీరామకృష్ణ పరమహంస ఎందుకు వచ్చారో అమ్మ అందుకే వచ్చింది. శ్రీ రమణమహర్షి ఎందుకు వచ్చారో అమ్మ అందుకే వచ్చింది. ఈ జగత్తుపై ఉండే అపారకృపవల్ల వారు భౌతికాకృతని దర్శిస్తారు. వారికి జన్మలూ కర్మలూ ఉండవు. మాయా సంపరితమైన జీవరాసికి స్వస్వరూప జ్ఞానం బోధించటానికి అనుసంధింప చేయటానికి వారు అవతరిస్తారు. సృష్టి ఎంత చింతనమో ఇటువంటి బ్రహ్మవేత్తల అవతరణం కూడా అంత అనాదిగా అనంతంగా సాగుతూనే ఉంటుంది అని అనిపిస్తుంది. అయితే అనంతమైన జీవలోక పరిభ్రమణంలో భక్తిజ్ఞాన కర్మ రాజయోగ హఠయోగతాంత్రిక సాధనల ద్వారా ఆత్మవిదులు లోకానికి జీవేశ్వరా భేదాన్ని ఆయా ప్రాంతాలలో ఆయా కాలాలలో ఆయా దేశాలలో అప్పుడప్పుడు ప్రబోధించటానికి ఈ లోకానికి దిగివస్తారు. వైరాగ్యమూ తత్త్వవిచారము ఆత్మానుభూతి శరణాగత ప్రేమభక్తి మొదలైన మార్గాల ద్వారా జీవావళిని ఉద్ధరించటానికే ఇటువంటి మహనీయుల రాక అని అర్థం చేసుకోవాలి. అయితే ఈ జన్మ పరంపర విషాదభరితమూ దుఃఖ భరితమూ అర్థరహితమూ అని కాదు. వారు బోధించటానికి వచ్చేది. ఈశ్వరుడు తనతో తావైన మనతో ఆడుకుంటున్నాడు. మనం కూడా ఆయనతో ఆడుకోవటం నేర్చుకోవాలి అని బోధించటానికే వీరంతా వస్తారనిపిస్తుంది. ఆయన ఆనంద స్వరూపుడు. చైతన్యమూ ఆనందమూ తప్ప మరేమీ కానివాడు. అది తెలుసుకుంటే అనుభవించడం నేర్చుకుంటే మనం కూడా ఆనంద స్వరూపులం కావచ్చునని ఈ యోగీశ్వరేశ్వరులు నిరూపించారు.

సంసారం వద్దనికానీ లోకయాత్రకు వైముఖ్యం చూపమనీకానీ, వారు

మనలను కోరలేదు. అదంతా నీవే అయినప్పుడు నీకు దిగులూ చింత ఎందుకు అని అంతర్ముఖత్వం బోధించారు. `అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా' అని లలితా సహస్రనామ ంలో ఉంది. శ్రీరామకృష్ణ పరమహంస అంతకఠోరమైన జితేంద్రియత్వం అనుపాలించడం ఎందుకంటే నూటికి నూరు పాళ్ళు తాను సాధించి చూపితే ఐదుపాళ్ళు అయినా లోకులు అనుసరించటం నేర్చుకుంటారనే ఆశతో. అయితే అమ్మ అపారకరుణా స్వరూపిణి సంసారం కూడా బంధం కాదు అని అభయం ప్రసాదించటానికే అవతరించింది.

ఆమె పరాత్పరి. జగద్ధాత్రి. భవతారిణి. భువనేశ్వరి. అందుకు సందేహం ఎందుకు? తన ప్రకృతిని, యోగమాయను లోకానికి బోధపరచటానికి ఆమె ఈ లోకానికి వచ్చింది. నందగోకులంలో దేవకికి జన్మించి నందయశోద స్తన్యపానం చేసిన బాలకృష్ణమ్మలాగా జిల్లెళ్ళమూడిలో జన్మించిన అమ్మకూడా గొల్లనాగమ్మ స్తన్యపానం చేసింది. నాలుగైదేళ్ళ వయసుననే మౌనస్వామి అనే పరమ యోగీశ్వరేశ్వరుడితో వేదాంత విచారం సలిపి ఆయన స్తుతికి పాత్రమైంది. లోకానికంతా తల్లి తనాన్ని చాటిచెప్పింది. 1923వ సంవత్సరం మార్చి 28వ తేదీన గుంటూరు జిల్లా మన్నవ అనే చిన్న గ్రామంలో మన్నవ సీతాపతి, రంగమ్మగారనే పుణ్యాదంపతులకామె ప్రభవించింది. ఆమె మూడేళ్ళ వయసుననే సమాధిస్థితిని భజించేది. నాలుగేళ్ళ వయసున లోకానికంతా తల్లి అయిన ఆమె తన తల్లిని పోగొట్టుకుంది. చిన్నతనంలోనే ఆమెకు వివాహమైంది. లోకరీతిని చెప్పాలంటే ఆమె అత్తగారి ఊరు జిల్లెళ్ళమూడి. జిల్లెళ్ళమూడి పేరులోనే ఏదో పరమార్థము గొప్పతనమూ నిగూఢతాత్త్విక విశిష్టత ఉన్నట్లున్నది. కంచిపరమాచార్యులు శ్రీశ్రీశ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు శివుడికి జిల్లేడు అంటే పరమ ప్రీతికరం అని చెప్పారు. శివాని కనుక ఆమె అచంచల ప్రతిష్ఠితురాలైంది అక్కడ. ఆమె చిన్నతనం నుంచీ భోజనం చేసేదికాదు. భోజనం పట్ల ఎటువంటి ఆసక్తి కనపరచేదికాదు. కాని తనను దర్శించినవారందరినీ దరిచేరిన వారందరినీ నానా అన్నం తిన్నావా? తినకపోతే - ఆశ్రమంలో అన్నం నిరంతరం సంసిద్ధంగా ఉండేది. తినిరా అని తొందరపెట్టేది. ఆమె తలికదా. శంకరభవత్పాదుల వారేమన్నారు! ''క్షుధాతృషార్తాం జననీం స్మరంతి'' అనలేదా! కలికాలంలో మానవులు అన్నగత ప్రాణులు, కఠినమైన తపస్సు యోగాభ్యాసమూ, తత్త్వవిచారమూ వాళ్ళకు ఉపాదేయం కావు. వాళ్ళు ప్రేమభక్తి ద్వారా తరించవలసి ఉంటుంది అని చెప్పారు. శ్రీరామకృష్ణ పరమహంస, అందుకే తన బిడ్డలందరూ అన్నం తిన్నారా లేదా అని ఆమె ఆత్రుత. ఆమె భోజనం చేయదు అంటే అవిశ్వాసులకు అది ఒక ఉత్కంఠ. మనస్త చైతన్యమూ తానే అయినప్పుడు ఆమె అంతటానే విస్తరించి ఉన్నప్పుడు `చిచ్ఛక్తిశ్చేతనా రూపా,

జడశక్త్యుద్దాత్మికా' అయినప్పుడు ఆమె అందరి లాగా భోజనం చేసి తను శ్రద్ధ చూపాలా? కంఠవ్రణంతో బాధపడుతూ "అమ్మా ఏదైనా ద్రావకం కొంచెం లోపలికి పోయేట్లు చేయవా. కాస్త తినటానికి అనుగ్రహించవా" అని అమ్మను ప్రాధేయపడితే ఆమె అన్నదట కదా! ఇంతమంది నోళ్ళ ద్వారా తింటూ కూడా నీకింకా తినాలని ఉందా! అని అమ్మ తన భ్రాంతిని నివారించింది అని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పలేదా? ఇరవయ్యో శతాబ్దంలో ఆంధ్రదేశంలో పరమాద్భుతం జిల్లెళ్ళమూడి అమ్మ అవతారా విర్భావం. అమ్మతో పరిచం ఉండే మనం నేరుగా ఇంటిలోపలికి వెళ్ళవచ్చు. ఆమె వంట ఇంట్లో ఉంటే అక్కడికీ, హాలులో ఉంటే అక్కడికీ వెళ్ళవచ్చు. కేవలం అయ్యగారితో మాత్రమే పరిచయం ఉంటే ముందుగదిలో ఆయన రాకకోసం నిరీక్షిస్తూ నిలిచోవటమో నిబ్బరం ఉంటే కూచోవటమో చేయాలి అన్నారు శ్రీరామకృష్ణులు. కాబట్టి తల్లిని నమ్ముకోవటమే నిశ్చింత. సుకరం, సులభం. అలా తన ప్రేమ వాత్సల్యాన్ని, కనికరాన్ని, అనురాగాన్ని, అనుగ్రహాన్ని లోకానికి ప్రసాదించటానికి అమ్మ మన్నవలో పుట్టింది జిల్లెళ్ళమూడి మెట్టింది. మానవ జీవితానికి జ్ఞానభిక్ష పెట్టింది. ప్రారబ్దం అనుభవించవలసిందే. చేసుకున్న కర్మనుంచి ఎవరూ తప్పించుకోలేరు. మరి ఏ మహాత్ముడు, ఏ సిద్ధపురుషులు, ఏ యోగీశ్వరుడు, ఏ పరివ్రాజకుడు, ఏ సాధుసత్తముడు ఏ విధంగా నీకు మార్గదర్శనం చేయగలడు, నిన్ను ఆదుకోగలడు అన్నదానికి యేనుగుల వీరాస్వామయ్యగారనే మహాపురుషుడు ఒక దృష్టాంతం చూపారు. అదేమంటే చిన్నబిడ్డ ఏదో అల్లరిచేశాడు. తండ్రికి చిరాకూ కోపమూ వచ్చాయి. పిల్లవాడి వీపుమీద ఒక చరుపు చరుద్దామన్నంత ఆవేశం కలిగి విసురుగా విసుగ్గా వస్తున్నారు. కాని ఇంతలో తల్లి వచ్చి చాల్లేండి చోద్యం పసివాళ్ళు అల్లరి చెయ్యరా. ఇదుగో చూడండి కన్నవాడి మీద చెయ్యి వేసారా నేనూరుకోను అని నవ్వూ కోపమూ చెలిమీ చనువూ చూపుతూ రుసరుసలాడితే తండ్రి ఏం చేస్తాడు? ఆ విధంగా శరణాగతి, భక్తి సంరక్షిస్తుంది అన్నారాయన. ఇక సాక్షాత్తూ తల్లికే మురిపెం కలిగితే ఇక కరమాగిర్మా ఏం చేసాయి? అదుగో అటువంటి అమ్మ జిల్లెళ్ళమూడి అమ్మ పాపవిమోచని. కర్మనాశని. కన్నతల్లి. ఆమెను చూసినవారూ, ఆమె ప్రసాదం రుచి చూసిన వారూ అదృష్టవంతులు.

## అమ్మ

చెప్పి నవ్వేడు శ్రీరాము చిత్తమొంది-నవ్వి చెప్పెడు శ్రీకృష్ణనయనమొంది
క్షేమమరయుచు బిడ్డలన్ ప్రేమజూచు-నంబ అనసూయ మాతకే నంజలింతు.

*- 'పద్మ శ్రీ' స్థానం నరసింహారావు*

# ఆది శంకర జన్మభూమి కాలడి

- డాక్టర్ మల్లిప్రియ నాగరాజు

## కాలడి పరిశోధన

(గత సంచిక తరువాయి)

"ఇద్దరూ నాయర్లే". శంకరాచార్యుల కాలంనాడు కాలడిలో కలిసే ఉండి ఉంటారు. తర్వాత ఓ కుటుంబం 7 కి.మీ. దూరానికి పారక్కుళం చేరి ఉంటుంది." అన్నారు. ఏమైనా కాలడి చూసేవారిని "అంబట్టువీడు!" అంబాదత్తు"- రెండూ చూడమని నేను కోరుతున్నాను. (ముఖ్యంగా చరిత్రపై మక్కువ గలవారిని). నా దృష్టిలో కాలడిలో సెంటర్‌లో వున్న మాలతి,. సతీషలదే నిజమైన `అంబట్టువీడు" (7 కి.మీ. దూరంలోగల ఊరునుంచి కత్తి రానక్కరలేదు. శంకరశర్మగారన్నట్లు తర్వాత కాలంలో కుటుంబం చీలి, ఒక ఫామిలీ పారక్కుళం చేరి వుంటుంది.

**16. మాణిక్య మంగళం కాత్యాయనీ అమ్మ దేవాలయం:** కాలడికి 2 కి.మీ దూరంలో వుంది. ఈ మాణిక్య మంగళం గ్రామంలోని కాత్యాయనీ అమ్మ దేవాలయం చాలా శక్తిమంతమైనది. శివగురువు, తర్వాత ఆర్యాంబ రోజూ క్షీరనైవేద్యం పెట్టిన గుడి. ఒకనాడు బాలాశంకరులు వెళ్ళి నైవేద్యం పెట్టారు. అమ్మ త్రాగలేదని ఏడిస్తే, ఆమె త్రాగేసింది. వెంటనే నైవేద్యం మిగలలేదని మళ్ళీ ఏడ్చాడట! అప్పుడు కాత్యాయనీ అమ్మ తన స్తన్యంతో గ్లాసు సగం నింపింది. శంకరులు ఆ పాలు త్రాగారు. జగన్మాత పాలు త్రాగబట్టే ఆయన 32 ఏళ్ళ అల్పాయుర్దాయంలో అన్ని శక్తులు సంపాదించారు. (పరకాయ ప్రవేశం ఆకాశయానం- ఆకాశంలో సంచరించే విద్య ఆయనకు తెలుసు. లేకుంటే కాలినడకన ఆ స్వల్పకాలంలో భారతదేశమంతా ఎలా తిరుగగలరు?)

**17. తోట్టువా ధన్వంతరీ దేవాలయం:** కాలడి నుంచి మలయత్తూర్ బస్ ఎక్కితే 15 నిమిషాలలో తోట్టువా జంక్షన్ వస్తుంది. కొంతదూరం నడిచి, పూర్ణానది (పెరియార్) పై బోటుపై వెళ్తే తోట్టువా గ్రామం వస్తుంది. ఇక్కడి ధన్వంతరీ దేవస్వం ఎంతో ప్రసిద్ధి చెందింది. (ఆయుర్వేద

మూలపురుషుడు ధన్వంతరి, నారాయణుని మరో అవతారం, చతుర్భుజుడు). నాపరిశోధనలో 3సార్లు వెళ్ళాను. ధర్మకర్త సుబ్రహ్మణ్య నంబూది నాకు పరమాప్తులైనారు. మరువలేని ఆతిథ్యం ఇచ్చారు. శ్రీపి.వి. నరసింహారావుగారిని ఈ గొప్ప దేవాలయం దర్శించమని నేను జాబు వ్రాసాను. ప్రధానమంత్రి కార్యాలయం నుంచి కేరళకు (తోట్టువా) నాకు వచ్చిన రిప్లయిని ధర్మకర్త గుంటూరు పంపించారు. ప్రధానమంత్రి, రాష్ట్రపతి కూడా త్వరలో దర్శిస్తారు. ఈ ధన్వంతరీ ఆలయానికి బాల శంకరులు తల్లితో ఎన్నోసార్లు వచ్చారు. ముఖ్యంగా హాయిగా ఆడుతూ, పాడుతూ, రోగం లేకుండా మరణం ప్రసాదించమని భక్తులు ధన్వంతరీ నారాయణుని కోరుతారు.

"అనాయాసేన మరణం
వినా దైన్యేన జీవనం
దేహాంతే తవసాయుజ్యం
దేహిమే ధన్వంతరి మహాప్రభో"-

ఆయనను సేవించే వారికి తప్పక ``అనాయాస మరణం" లభిస్తుందని నా ప్రగాఢ విశ్వాసం.

**18. త్రిచూర్ వడక్కునాథ దేవాలయం:** ఇది కేవలం పూర్తి నేతిలింగం (అమర్‌నాథ్‌లో మంచులింగం వలె) ఈ నేతి శివలింగానికి ఎంతో నెయ్యి అభిషేకిస్తున్నా, ఆలయంలో ఒక్క చీమ కనిపించదు. ఆర్యాంబ, శివగురువులకు సంతానంగా తాను జన్మిస్తానని ఈశ్వరుడు చెప్పిన గుడి ఇదే. కాలడికి 55 కిలోమీటర్లు. త్రిచూర్ మద్రాస్ అంత మహాపట్టణం. పట్టణం నడిబొడ్డున ఈ వడక్కు నాథాలయం వుంది.

**19. స్వర్ణత్తుమన:** కాలడికి 24 కి.మీ. లోగల `పళంతొట్టం'లో "స్వర్ణత్తుమన" ఉంది. కాలడి నుంచి పెరుంబావూర్ వెళ్ళి, అక్కడి నుంచి త్రిపునత్తర బస్‌లో వెళ్ళాలి. శంకరులు బాల్యంలో "కనకధారాస్తోత్రం" చెప్పి లక్ష్మీదేవిచే బంగారు ఉసిరికాయలు కురిపించిన ఇల్లే "స్వర్ణత్తుమన"(బంగారు భవనం). కానీ లోనికి ఎవ్వరినీ రానివ్వరు. (కారణం బంగారుమయం). నా పూర్వ జన్మ సుకృతం వల్ల 1993 జూలై 21న నాకు స్వాగతం లభించింది. ఈ 1995లో రెండుసార్లు వెళ్ళాను. ఒకరోజు రాత్రి నిద్రించాను. కోటీశ్వరులైన సోదరులు నాకు అన్నం పెట్టారు స్వయంగా. (నంబూద్రి స్త్రీలు ఈ భవనం వారు బయటకు రారు, పురుషులకు కనిపించరు) నా మలయాళ గ్రంథం "జ్ఞానస్వాన"లో దోషాలు సవరించారు కూడా. దీని యజమానులైన శ్రీ

బ్రహ్మదత్త నంబూద్రిపాద్, శ్రీనీలకంఠ నంబూద్రిపాద్, శ్రీనారాయణ నంబూద్రిపాద్, శ్రీకృష్ణన్ నంబూద్రిపాదు, శ్రీవాసుదేవన్ నంబూద్రిపాద్ - నిజంగా నా దృష్టిలో పంచపాండవులే. బంగారు భవనాన్ని ఎవరికీ చూపని వీరు 1996లో నాకు కేరళలో జరిగే సన్మానానికి ఉపన్యాసకులుగా వస్తామన్నారు. ఇది దైవకృప. ఈ ``స్వర్ణత్తుమన"లో శంకరుల కాలం నుంచీ గల వీరి కుటుంబీకుల తైలవర్ణ చిత్రాలున్నాయి.

**20. భువనేశ్వరీ ఆలయం:** "స్వర్ణత్తుమన" వారి స్వంత దేవాలయం. ఎవ్వరికీ ప్రవేశం లేదు. (విజయదశమినాడు రానిస్తారట - ఆ రోజు కూడా ఆలయం మాత్రమే చూడనిస్తారు. ``స్వర్ణత్తుమన"లోకి ప్రవేశం ఉండదు). ఈ ఆలయంలో ``భువనేశ్వరి" నిజంగా ఒక స్త్రీ కూర్చున్నట్లుగా వుంటుంది. ఈ ఆలయ దర్శనంతో నాకు కొన్ని దివ్యశక్తులు లభించాయి.

**21. చోటా నిక్కర్ భగవతి ఆలయం:** కేరళలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన భగవతీ ఆలయం ఇది. శంకరులు వేంచేసిన స్థలం. అనుదినం వేలసంఖ్యలో జనం వస్తారు. పెరుంబావూర్ నుంచి త్రిపునత్తర బస్‌లో హిల్ పాలెస్ వద్ద దిగి వెళ్ళాలి.

**22. కాలడి చర్చి:** కాలడిలో మూడు చర్చిలు ఉన్నా, సెంటర్‌లో ఉన్న చర్చి మిక్కిలి పెద్దది. క్రైస్తవ సోదరులకు ఆరాధనీయమైనది.

**23. మలయత్తూర్ చర్చి:** ఇక్కడికి ఈస్టర్ పండుగకు హిందువులు కూడా విపరీతంగా వెళ్తారు. హిందువుల దృష్టిలో ఇది తొలుత శివాలయం. చర్చి కింద శివలింగం ఉందనే అంటారు. హిందువులు ``మలయత్తూర్ ముత్తప్పన్" అంటారు.

**24. కాలడి మసీదులు:** కాలడిలో 3 మసీదులున్నాయి. ముఖ్యంగా మట్టూర్ రోడ్‌లోగల మసీదు ఎంతో బాగుంది. ముస్లిం సోదరులకు ఇది మక్కాతో సమానం. అసలు కేరళలోగల ``మతసహనం" అన్ని రాష్ట్రాలకూ ఆదర్శప్రాయమైనది. మనం బస్‌లో వెళ్తుంటే కేరళ రాష్ట్రంలోని ప్రతి ఊరులోనూ చిన్న చర్చి, మసీదు, దేవాలయం వుంటాయి. మత కలహాలు లేని రాష్ట్రమది.

**25. తిరువెళ్ళిమాంతుళ్ళి వడక్కు నాథాలయం:** కాలడికి 2 కి.మీ. దూరంలో మట్టూరు ఉంది. అక్కడ నుంచి కొంతదూరం అడవిలోకి వెళ్తే "తిరువెళ్ళి మాంతుళ్ళి వడక్కు నాథాలయం" చూడవచ్చు. అడవిలో ఎవరైనా నడచి

వెళ్ళక తప్పదు. ఈ ఆలయ చరిత్ర గొప్పది. పైగా కాలడికి చెందిన ఏకైక శివాలయం ఇది. బాలశంకరులు సన్యసించి కాలడి వదలి వెళ్ళాక, మనశ్శాంతిలేక ఆర్యాంబ ప్రతి సోమవారం త్రిచూర్ వెళ్ళి (ఆనాడు వృషభాచలేశ్వరం లేక శివతెరుపేరూర్ అనేవారు) సోమవార వ్రతం చేసేది. ఓ వారం వెళ్ళలేకపోయింది. ఎంతో బాధపడింది. ఆ రాత్రి స్వప్నంలో ఈశ్వరుడు కనుపించి, అంతదూరం (55 కి.మీ) రానక్కరలేదని, తానిక్కడే ఉన్నానని, మరునాడు ఉదయం ఒక తెల్లని జింక తనను చూపిస్తుందని చెప్పాడు.

మర్నాటి ఉదయం తెల్లజింక కనుపించింది. ఆర్యాంబ దాన్ని అనుసరించగా, అది మట్టూరు అడవిలోకి ఆమెను చేర్చి ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి క్రిందికి దూకింది. వెంటనే అక్కడ అందమైన కొలను ఏర్పడింది. జింక మాయమైంది. అక్కడ పెద్ద శివలింగం కన్పించింది. అది త్రిచూర్‌లో లాగా నేతిలింగం కాదు. గాని "స్వయంభూ" శివలింగం. అచ్చు త్రిచూర్ వడక్కునాథాలయంలోని శివలింగమంతే వుంది. అప్పటి నుంచీ ఆర్యాంబ ఇక్కడే సోమవార వ్రతం చేసేది. "మాన్" అంటే మలయాళంలో జింక. "తుళ్ళి" అంటే దూకటం. "వెళ్ళి" అంటే వెండి లేక తెలుపు. "తిరు" అంటే గొప్ప. తెల్లని వెండి జింక దూకిన ప్రదేశంగన్క, పైగా వడక్కు నాథునిలా శివలింగం ఉంది గన్క, దీన్ని ``తిరువెళ్ళి మాంతుళ్ళి వడక్కునాథాలయం" అన్నారు. ఇక్కడి ప్రకృతి చూడముచ్చటగా వుంటుంది. జింక దూకిన కొలను చాలా పురాతనమైనా, శిధిలంగా ఉన్నా, ఎంతో ఆహ్లాదాన్ని కల్గిస్తుంది.

1995 జూన్ 1న నేను ఈ ఆలయాన్ని దర్శించాను. మరోమారు "షుగర్" వ్యాధిని సమూలంగా నిర్మూలించే మూలికల కోసం జూన్ 16న అడవిలోకి వెళ్ళాను. దేవాలయం మూసివున్నా కొలనువద్ద కూర్చొని నా "ఆది శంకర జన్మభూమి క్షేత్రం కాలడి" గూర్చిన పరిశోధన ఇంగ్లీషు ప్రతిని 1600 పేజీలు ఇక్కడే ఫెయిర్ చేసాను. తిరిగి కాలడికి "గుడ్‌బై" చెప్పేరోజు 1995 జూన్ 19న తెల్లవారు జామునే పూర్ణానదిలో స్నానం చేసి, ఒక్కడినే తెల్లవారుజామున 4.30కే అడవిలోకి వెళ్ళి, 4.45 కల్లా ఆలయం చేరి, ఉదయం 6.25 వరకూ ఉన్నాను. 6.25 స్వామికి హారతి ఇచ్చి దేవాలయం బయటికొస్తుంటే, ద్వారం గుండా కాకుండా, కిటికీలోంచి (అపసవ్యమార్గం ద్వారా), నాలుగేళ్ళ బాలుడు ఆలయంలో ప్రవేశించాడు. నుదుట విభూతి, చందనం, మెళ్ళో రుద్రాక్షలు, తులసిమాలలు (శివుడో,

నా స్వామి గురువాయూర్ బాలకృష్ణుడో తెలీదు), చిన్నలుంగీ, నంబూద్రి గెటప్, చిన్న చేతులతో పెద్ద దొన్నె నిండా నీరు- కిటికీ గుండా వచ్చాడేమిటని అనుకొంటూనే (నా అజ్ఞానం వల్ల), అందమైన ఆ బాలుని నెత్తిపై ఆశీర్వాద పూర్వకంగా చేయిపెట్టాను. అంతే! కరెంట్ షాక్‌లా కొట్టింది. భయపడ్డాను. ఆ బాలుడు నన్ను చూసి నవ్వుతున్నాడు. బయటకొచ్చేసాను. ప్యాంటు షర్టు వేసుకొని, నా సంచీ సర్దుకొనేసరికి 15 నిమిషాలు పట్టింది.

అప్పుడు అనుమానం కలిగింది. ఉదయమే అడవిలోని ఆ గుడికి వచ్చిన ఆ బాలుడెవరు? పావుగంటైనా వెనుక తల్లో, తండ్రో, తాతో, మామో ఎవరూ రాలేదేం? వెంటనే తిరిగి లుంగీ ధరించి ఆలయంలోకి పరిగెత్తాను. ఆ బాలుడు లేడు. పూజారి నడిగాను. వెనుకవైపు మెట్లు దిగి అక్కడ నివసించే వారినడిగాను. ఆలయం మూసే దాకా ఉదయం 8.30 వరకూ వచ్చిన కొద్దిమందిని అడిగాను. (అడవిగన్క వచ్చేవారు తక్కువ). దేవాలయం మూసాక ఉదయం 10.30 వరకూ ఉన్నాను. ఎవరినడిగినా తమ పిల్లవాడెవరూ రాలేదనే జవాబు . అప్పుడు సత్యం గ్రహించాను. ఆ బాలుని నెత్తిన చెయ్యి పెట్టిన క్షణం నుంచీ (జూన్ 19, ఉదయం 6.28- అప్పటి నుంచి నాకు ఆకలిలేదు. పెడితే తింటాను. అంతే! కలలులేని నిద్ర హాయిగా పడుతోంది. కొన్ని శక్తులూ లభ్యమయ్యాయి. వ్యాధులను తేలిగా పోగొడుతున్నాను. "అహం" అనేది (నేను) పూర్తిగా పోయింది. ప్రస్తుతం డబ్బు మీద ఆసక్తి కూడా లేదు. జగద్గురు శంకరాచార్యుని కృపే దీనికంతకూ కారణం. జీవితాన్ని మార్చివేసింది "తిరువెళ్ళి మాంతుళ్ళి" శివాలయం. కాలడి వెళ్ళేవారు కొంచెం శ్రమ అయినా ఈ దేవాలయం తప్పక చూడాలి. (అడవిలో ఏ భయమూ ఉండదు).

**26. గురువాయూర్ కృష్ణాలయం:** కాలడి వెళ్ళేవారు ప్రపంచ ప్రసిద్ధి చెందిన గురువాయూర్ కృష్ణాలయం చూడకపోతే ఎలా? ఇంతకన్న పవిత్రమైన ఆలయం భారతదేశంలో మరెక్కడా వుండదు. "కన్నా" అని పిలిస్తే చాలు, బాలకృష్ణుడు పలుకుతాడు. మీ వ్యాధులు పోగొడతాడు. మీ కోర్కెలన్నీ తీర్చేవాడు "వీడే". గురువాయూర్ వైభవం ఎవరు వర్ణించగలరు? తెల్లవారు జామున 3 నుంచి 3.35 వరకు నిర్మాల్య దర్శన కాలంలో ఆయన చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుడు. తెల్లవారు జామున 3 గంటలకు స్నానం చేసి, వేలాది భక్తులు ఈ నిర్మాల్య దర్శనం కోసం క్యూలో వేచి వుంటారు. 3.35కు గర్భగుడి మూస్తారు. వెంటనే నాలుగు 4 గంటలకు కోసం (తెల్లవారు జామున) సుప్రభాతం ప్రారంభమై, ``బాలకృష్ణుడు" జగన్మోహనంగా మనకు

దర్శనమిస్తాడు. జయదేవ మహాకవి అన్నట్లు ``సకల భువన జన తరుణేన" మధ్యాహ్నం యవ్వన కృష్ణుడు, రాత్రి 9.30కు 120 ఏళ్ళ కురుక్షేత్ర కృష్ణుడు. స్వామికి రోజూ 3 సార్లు ``సివేలీ" జరుగుతుంది. (ఏనుగుపై ఉత్స విగ్రహాల ఆలయ ప్రదక్షిణం) ముఖ్యంగా రాత్రి 10 గంటలకు 4 ఏనుగులు పాల్గొంటాయి. స్వామికి వింజామరలు వీస్తుంటే, భక్తులు స్వయంగా వెలిగించే వేలాది దీపాలతో, భక్తులు స్వామి ఏనుగులతో ప్రదక్షిణం చేస్తుంటే నాష్టాంగ పడుతుంటే "సొగసు చూడతరమా!' గురువాయురప్పన్‌కు 140 ఏనుగులున్నాయి. ఆదాయంలో దేశంలో రెండవ స్థానంలో వున్నా (తిరుమల వెంకటేశ్వరుడు ప్రథమస్థానం) పవిత్రతతో మాత్రం గురువాయూర్‌దే ప్రథమస్థానం. "చతుర్దశభువనాల"లోని (14 లోకాల) సౌందర్యమంతా ఈ గురువాయూర్ బాలకృష్ణునిలోనే నిండి నిబిడీ కృతమై వుంది. ఈ గురువాయూర్ దేవాలయం కలియుగంలో వెలిసిన తొలి ఆలయం. (ద్వాపర యుగం పూర్తయి కృష్ణ దేవుడు నిర్యాణం చెందిన7వ రోజున ద్వారకా నగరం సముద్రంలో మునిగిపోయింది. సముద్రంపై తేలి వస్తున్న ఈ విగ్రహాన్ని వాయుదేవుడు బయటకు తేగా, దేవగురు (బృహస్పతి), వాయువు కలిసి కేరళలో దీన్ని ప్రతిష్ఠించారు. కనుక గురువాయూర్ అయింది. శ్రీ శంకరాచార్యులవారికి ఈ క్షేత్రమంటే ప్రాణం. శంకరాచార్యులు ఏర్పరచిన పద్ధతిలోనే నేటికీ ఇచ్చట పూజలు జరుగుతున్నాయి. (తంత్రశాస్త్ర రీతిలో)

*ఇది నా కాలడి పరిశోధన :*

ఇక శంకరాచార్యుని "అద్వైతం" గూర్చి పద్మపాదుడు రెండే ముక్కలలో చెప్పాడు. "బ్రహ్మం సత్యం, జగత్తుమిథ్య" పరమాత్మ ఒక్కడే సత్యం. ప్రపంచంలో మనకు కనుపించేదంతా మాయ. జీవుడనబడేవాడు బ్రహ్మంకన్న వేరుకాదు. రెండూఒకటే!

"మాతానాస్తి, పితానాస్తి, నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి, గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత జాగ్రత"
మానవుల గూర్చి శంకరుని ఆవేదన ఈ క్రింది శ్లోకంలో వుంది.
"బాలస్తావత్రీ క్డాసక్తః, స్తరుణస్తావత్తరుణీ సక్తః
వృద్ధస్తావచ్చిన్తాసక్తః, పరమే బ్రహ్మణి కోపినసక్తః"

(మానవుడు బాల్యంలో క్రీడాసక్తుడుగా (ఆటలయందు ఆసక్తితో), యవ్వనంలో వనితాసక్తుడుగా, వృద్ధాప్యంలో చింతాసక్తుడుగా ఉంటున్నాడే తప్ప, పరబ్రహ్మసక్తుడయ్యేవాడు ఏడి? అంటే పరమాత్మను స్మరించేవారు

ఏరి?)

"... ంత రమణీయం సర్వ ముదుంబర ఫలోసమం భోగ్యం
అజ్ఞానముప భోగ్యంనతు తద్ద ...నాం పరం హేయం"

మేడిపండు పైకి రమ్యంగా వున్నా, పొట్ట విప్పితే పురుగులే! భార్యకూడా అంతే లోపల మల మాంసాలే.

"శ్లేష్మో ...ర ముఖం స్రవన్మలవతీ నాసాశ్రుమల్లోచనం
స్వేద స్రావి మలాభిపూర్ణ మభితో దుర్గన్ధ దుష్టం వపుః
అన్యద్వక్తు మశక్యమేవ మనసా ...స్తుం క్వచిన్నార్హతి
స్త్రీ రూపం కథమీదృశం సుమనసాం పాత్రీ భవన్నేత్రయోః"

(నోటి చొంగ, ముక్కునీరు, కంటిలో పుసి, శరీరంపై చెమట, లోపల మలమూత్రాలు, దుర్గంధపూరితమైన ఈ స్త్రీ రూపాన్ని వివేకులు కోరరు)

"ఆహార నిద్రాభయమైథునాని
సామాన్యమే తత్పశుభిర్నరాణామ్
జ్ఞానం నరాణా మధికో విశేషః
జ్ఞానేనహీనః పశుభిస్సమానః"

(ఆహారం, నిద్ర, భయం, సంసారసుఖం (సెక్స్) మనుషులకూ, పశువులకూ సమానమే. ఎటొచ్చి మానవులకు అధికంగా ఉన్నది జ్ఞానం. కనుక అట్టి జ్ఞానం లేనివాడు - అనగా జ్ఞాన సముపార్జన చేయనివాడు పశువుతో సమానం.)

"కాలడి" అనే మాటకు ``కాలభయం లేనిది" - అనగా మరణభయం లేనిది అని అర్థం. ఆది శంకర జన్మ భూమిక్షేత్రమైన కాలడిలో ఉన్నవారికి, ఆ 'కాలడి'ని దర్శించిన వారికి ఇక మరణభయం ఎక్కడిది?

ఇంతకూ "కాలడి"కి ఎలా వెళ్ళాలి? హైదరాబాద్ నుంచి వెళ్ళేవారు కొచ్చిన్ ఎక్స్‌ప్రెస్‌లో త్రిచూర్ వెళ్ళాలి. విజయవాడ నుంచి వెళ్ళేవారు కేరళ ఎక్స్‌ప్రెస్‌లో త్రిచూర్ చేరవచ్చు. మద్రాసు నుంచి త్రిచూర్ రావచ్చు. మద్రాస్ నుంచి వచ్చేవారు ఆగుంబేలోనూ, ఆల్వేలోను, అంగమాలిలోనూ కూడా దిగి బస్‌లో కాలడి వెళ్ళవచ్చు. హైదరాబాద్, విజయవాడ నుంచి వెళ్ళేవారు పాలఘాట్‌లో దిగి కూడా వెళ్ళవచ్చు. ఏమైనా హైద్రాబాద్ నుంచి కానీండి, విజయవాడ నుంచి కానీండి. మద్రాసు కానీండి - ఎక్కడ నుంచి బయలు దేరినా త్రిచూర్ దిగటమే ఉత్తమం (అక్కడ నేతి శివలింగం వున్న

వడక్కునాథాలయం చూసుకొని వెళ్ళవచ్చు) త్రిచూర్ నుంచి 29 కిలోమీటర్ల దూరంలో "భూలోక వైకుంఠం" గురువాయూర్ ఉంది. బస్‌లో వెళ్ళవచ్చు. 1994 జనవరి 9న ప్రధాని పి.వి. నరసింహారావుగారు గురువాయూర్ రైల్వేస్టేషన్ ప్రారంభించారు. గన్క, త్రిచూర్ నుంచి అరగటంలో రైల్లోనూ గురువాయూర్ వెళ్ళవచ్చు. త్రిచూర్ నుంచి మరోవైపుగా 55 కి.మీ.లో కాలడి వుంది గన్క బస్‌లో 2 గంటలలో కాలడి చేరవచ్చు (కాలడికి రైలు లేదు. ప్రక్కనే గల "అంగమాలి"లో రైల్‌స్టేషన్ వుంది).

మానవజన్మ తరించాలంటే, టూరిస్ట్ బస్‌లలో అలా చూసి, ఇలా రావటం కాదు. కాలడిలో పది రోజులు, గురువాయూర్‌లో పది రోజులు ఉండి, జీవితాన్ని, ప్రకృతినీ, పరిసర క్షేత్రాలను పరిశీలించి, పరిశోధిస్తే జీవిత లక్ష్యం ఏమిటో మనకు తెలుస్తుంది.

మా గురుదేవులు, పల్నాటి సీమలోని పిడుగురాళ్ళ శ్రీరామతీర్థసేవాశ్రమ స్థాపకులునైన శ్రీశ్రీశ్రీ కేశవతీర్థస్వామి సెలవిచ్చినట్లు "ప్రజా జీవనంలో విజృంభించిన అపార్థ మత కల్మషాన్ని తన హృదయరక్తంతో ప్రక్షాళన చేసిన విశ్వప్రేమావతారుడు శంకరుడు. అల్పాయుర్దాయంలోనే ఈ మహాతపస్వి చేసిన ధర్మ ప్రచారం చూపిన అఖండ శేముషి, విశ్వ చరిత్రలో ఇంకొక వ్యక్తిలో కనబడదు."

మా నాన్నగారు, గుత్తికొండ పల్నాటి సీమ నివాసులైన శ్రీ లలితానందేంద్ర సరస్వతీ స్వామివారు (పూర్వాశ్రమంలో అక్కిరాజు పెద నరసింహయ్యగారు) చెప్పినట్లు.

"దుఃఖతరంగాల తాకిడికి బిక్కరై నిర్వీర్యమైన నేటి ఆధునిక భారతావనికి శంకరాచార్యుల వారి ఆధ్యాత్మిక జ్ఞానోపదేశాలు అత్యంతావశ్యకములై యున్నవి. మన హృదయాలలో ఆ సత్యతత్త్వాన్ని పదిలపరచుకో గలిగితే, అంధకారకుడ్యాలను ఛేదించుకొని, శాంతిస్థానానికి మనం విజయవంతంగా చేరుకోగలం."

అట్టి మహాశక్తిని ఆ శంకరభగవత్పాదులు మనకు ప్రసాదించుగాక.

(అయిపోయింది)

# బ్రహ్మశ్రీ చందోలు రాఘవనారాయణశాస్త్రిగారిసందేశము

*ప్రమోదనామ సంవత్సర గురుదత్త జయంతి మహోత్సవ సందర్భములో బ్రహ్మ శ్రీ చందోలు రాఘవనారాయణశాస్త్రిగారు అనుగ్రహించిన సందేశము*

శ్రీదత్తాత్రేయ స్వామి, అత్రి అనసూయులకు జన్మించాడు. ఆయన భక్తుల కొరకు తన్ను తాను సమర్పించుకొని స్వయదత్తుడు అయినాడు. చంద్రుడుగా అవతారమెత్తి ఆకాశములో నుంచి అమృతమయములైన వెన్నెల కిరణాలతో లోకాలను నింపాడు.

దత్తాత్రేయుడు సాక్షాత్ విశ్వేశ్వరుడు. విశ్వమయుడు విశ్వంభరుడు. విశ్వనాథుడు. ఆయన విశ్వం విశ్వమే ఆయన.

దత్తాత్రేయులవారు, దుర్వాసులుగా అనసూయదేవి గర్భంలో ప్రవేశించారు. కార్తవీర్యార్జునుణ్ణి, ప్రోత్సహింపగా అగ్నిదేవుడు మునీశ్వరుల ఆశ్రమాలను కాల్చి భస్మం చేయసాగాడు అప్పుడు తల్లి గర్భంలో నుంచి దుర్వాసుల రూపంలో దత్తాత్రేయులు వెలువడి కార్యవీర్యార్జునుణ్ణి శపింపబోయినాడు. అప్పుడు దత్తస్వామి వీడు(కార్తవీర్యుడు) నీశిష్యుడు వీణ్ణి శపింపవద్దు అని దుర్వాసుడిని శాంతపరిచాడు. అప్పటి నుంచి అగ్నిదేవుడు దత్తాత్రేయుని ఆజ్ఞానుసారం ఆశ్రమాలను దహించటం మానివేసాడు.

దత్తాత్రేయ స్వామి మహావిష్ణువు అవతారం. విష్ణుదేవుడు ఎన్ని పనులు చేశాడో శ్రీదత్తస్వామి అన్ని పనులు చేసి అన్ని విధాలా లోకాలను రక్షించాడు.

దత్తాత్రేయస్వామి త్రిమూర్త్యాత్మకయిన అవతారం. మహానుభావుడు. ఆర్తజన సంరక్షకుడు. శ్రీవిశ్వంజీ నిత్యము దత్తాత్రేయస్వామిని అర్చిస్తూ, ఆరాధిస్తూ ఉండటం మీ అందరికి తెలుసు. విశ్వం అంటే సాక్షాత్తు విష్ణువే. విశ్వానికి విష్ణువుకు ఏ మాత్రం భేదం లేదు. అందుకనే విషుసహస్ర నామాలు విశ్వంవిష్ణుః అని ప్రారంభం అవుతాయి. వైకుంఠవాసి అయిన శ్రీమహావిష్ణువు పైన కైలాసవాసి అయిన శివుడు ఉన్నాడు. ఆయన బహిర్ముఖుడు, అంతః ర్ముఖుడు కూడా. అంటె లోపల వెలుపల ప్రపంచమంతా శివస్వరూపమే

ఆపైన కామేశ్వరి అమ్మవారు ఏమి చెబితే పరమశివుడు అదిచేస్తాడు. ప్రపంచమంతా ఆ దేవి కనుసన్నల్లో నడుస్తుంటుంది.

బ్రహ్మజ్ఞులు, బ్రహ్మవేత్తలు..అయిన మహానుభావులు ఆ జగన్మాతను సందర్శిస్తారు. బ్రహ్మవేత్తల మాటలకు తిరుగులేదు వారి నోటి వెంట ఏమి వస్తే అది జరిగి తీరుతుంది.

అంబరీషుడు మహాభక్తుడు ఆయన బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మ సాన్నిధ్యంలో కూర్చున్నాడు. " నీవు స్వర్గం కంటే పైన వున్న ఈ బ్రహ్మలోకానికి వచ్చావే, ఎలా రాగలిగావు?" అని ప్రశ్నించాడు బ్రహ్మ. నేను ఆ పూజలు చేశాను, ఈ పూజలు చేశాను, ఎన్నెన్నో ధర్మకార్యాలు చేశాను అంటూ తను చేసిన పుణ్యకార్యాలన్ని ఏకరువు పెట్టసాగాడు అంబరీషుడు. బ్రహ్మదేవుడికి కోపం వచ్చింది. వీడు ఆత్మస్తుతి చేసుకుంటున్నాడు. తను చేసిన పుణ్యాలన్ని ఎంతో గొప్పగా చాటుకుంటున్నాడు. వీణ్ణి శపించాలి అనుకున్నాడు బ్రహ్మదేవుడు. అంబరీషుడు తాను చేసిన సత్కార్యాలన్నీ చెప్పి చెప్పి స్వామీ ఈ సత్కార్యాల ఫలంగా నేను ఈ బ్రహ్మలోకానికి రాలేదు అన్నాడు. బ్రహ్మదేవుడు ఆశ్చర్యచకితుడై మరి ఏ ప్రభావము వల్ల యిక్కడకు వచ్చావు అని అడిగాడు. నేను మహర్షులు విశ్వశాంతి కోసం చేస్తున్న మహాయజ్ఞానికి రక్షకుడుగా వెళ్ళాను నా శక్తికొలది ఆ యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగటానికి ప్రయత్నించాను నా కృషి ఫలించింది. బ్రహ్మవేత్తలయిన మహర్షులు ఎంతో సంతోషించి, నీకు బ్రహ్మలోక ప్రాప్తిరస్తు అని ఆశీర్వదించారు అన్నాడు. " ఆ బ్రహ్మర్షుల యొక్క ఆశీర్వచన బలమువల్ల నేను ఉన్నంతకాలం నీవు కూడా నాతో పాటు యిక్కడనే వుండు" అన్నాడు బ్రహ్మదేవుడు.

ఈ కథ చెప్పి మీరంతా బ్రహ్మవేత్తలు వచ్చారు నన్ను ఆశీర్వదించండి అని శ్రీవిశ్వయోగి విశ్వంజీ ముఖం చూస్తూ, శ్రీరాఘవ నారాయణశాస్త్రిగారు చిరునవ్వు వ్వా నవ్వారు.

శ్రీవిశ్వయోగి విశ్వంజీ" మీరు నాకు ఆశీసులివ్వండి" అని శ్రీచందోలు శాస్త్రిగారిని అభ్యర్ధించారు. " నీకు నేను ఆశీస్సులు యివ్వటమాఅ మీరే అందరికీ ఆశీస్సులు ప్రసాదించాలి. మీరు సాక్షాత్తూ భగవంతులు. దత్తాత్రేయ స్వామివారి అవతారం " అన్నారు శాస్త్రిగారు.

సర్వేజనాః సుఖినోభవంతు, లోకా సమస్తా స్సుఖినోభవంతు ఇదే నా సందేశము అని ముగించారు శ్రీశాస్త్రిగారు.

# విశ్వయోగము

- డా. ప్రసాదరాయ కులపతి

నరులలోని దివ్యాంశము పరికించుట నా కార్యము
పరికించిన ఆ వెలుగును ప్రకటించుట నా తత్త్వము
దేవీ కరుణామయ చిత్కళయే లేకుండిన
నరుడు నరేంద్రుడు కాడని నానమ్మిన సిద్ధాంతము

ఈ సత్యము లోకములో నెరిగిన వారెంతమంది
ఈ స్థితి ఆలోకనలో నెంచిన వారెంతమంది
అంతమంది అంతరంగ చింతామణులందులోన
కొంతమంది గుణనిధులై గురుతత్త్వము గ్రహియింతురు

ఆ యెరుకను పొందుటకై అంతరమున తపియించిన
ఆ సత్యము చూచుటకై అఖిలమ్మును అర్పించిన
ఆ తత్త్వము తానగుటకు అంకితముగ జీవించిన
విద్వాంసుల కోవలోనె విశ్వయోగి విశ్వంజీ

హిమగిరి శిఖరమ్ము వోలె ఎత్తయిన యశస్సువాడు
పారిజాత పుష్పమువలె పరిమళించు మనసువాడు
గగన గాంగ వీచికవలె కల్మషములు లేనివాడు
అందరికిని ఆత్మీయుడు మందస్మిత మహితుడతడు

సత్యసాయి కరకమలావిర్భూత భూతివోలె
చల్లగ తెలినవ్వులు చిందించుచు చేరునొక్కప్పుడు
దత్తాత్రేయుని విధాన తత్త్వముగ్రహింపరాక
చిత్రమ్మగు వర్తనతో చెలువొందు నొక్కప్పుడు

పద్మమ్ముల వేడుకొనకె భానుడు వికసింపజేయు
మేదిని ప్రార్థించకొనకె మేఘుడు వర్షిమ్ము కురియు
విమలాత్ము లయాచితముగ విశ్వహితము కావింతురు
విశ్వంజీ వారలలో వికసించిన మందారము

ఓయని పిలిచిన నోహోయని పలుకునతడు
ఆర్తుల కాపాడుకొరకు అవిరళ కృషి చేయునతడు
అడుగడుగున ఆత్మీయత ఆర్ద్రతతో అందించెడి
స్పందించెడి మానవతా మందిరమ్ము విశ్వంజీ

సంఘము సృష్టించుకొన్న చైతన్యపు దీపమతడు
విశ్వ విహాయసమునందు వెలసిన శుకరూపమతడు
మయ శంబర మారీచులు మసలుచున్న లోకములో
విశ్వశాంతి సాధించెడి వీరుడతడు విశ్వయోగి

*(విశ్వరచన సౌజన్యంతో)*

# విశ్వమధు

*- శ్రీ బ్రహ్మాండం వెంకట లక్ష్మీనరసింహారావు*

విశ్వనాథుని గొలిచి విశ్వమే తరించు
వాసుదేవుని గొల్చిన వసుధ పొంగు ఇమ్మ
హా సృష్టియే కొలుచు గురుకటాక్షమును
విశ్వయోగి పలుకు పుట్ట తేనెలొలుకు

ప్రహ్లాదుడు ధ్రువుడు ఆ దర్శము జనాళికి
ఆహ్లాదము భక్తి విశ్వాస ధర్మములును
ప్రహ్లాదమొంద వయసు పని లేదయా
యోగి పలుకు తేనెలే వొలుకు

వెన్నెతో తినిపించె గీత సారమంతయు
వేణువైనింపె జగతి ఓంకారమ్ము విశ్వాక
ర్షణుండు కృష్ణుడు జగద్గురు వేనయా
యోగి పలుకుజుంటి తేనెలొలుకు

వేదమ్ములు ధ్వనించు ఓంకార
నాదమ్ము అమృతమ్ము జగతి సృష్టి

కాధారము మూలము శబ్ద బ్రహ్మయు
విశ్వయోగి పలుకు తేనెలొలుకు

దేవుడనగ వేరు జగమందు లేడు ఇల
అవిటి కుంటిగుడ్డి వికలాంగులందు
జీవులందు సుఖదుఃఖములందు తోడు
విశ్వయోగి పలుకు తియ్య తేనొలొలుకు

విషయ వాసనలందు మునగవేసివేసి
విషమస్థితి జేరుదుర్బలమనములు
విష్వక్సేనుని గొలువ వివేకముదయించు
విశ్వయోగి పలుకులు తేనెలొలుకు

దైవ సృష్టి దివ్యము సుందరము
దివి భువిమించిన సౌందర్యము
సర్వ సృష్టికి మూలము సద్గురువు
విశ్వయోగి పల్కు తేనెలొలుకు

త్రిభువనములకు తారకము భూ
న భోంతరములకు ఆధారము దివ్య
ప్రభా సంపన్నము సద్గురు ప్రేమయే
విశ్వయోగి పలుకు తేనెలై వొలుకు

జ్ఞానానందమూర్తి ప్రజ్ఞానమూర్తి దివ్య
జ్ఞానమూర్తి త్రికాలజ్ఞమూర్తి త్రిమూర్తి
జ్ఞాన ప్రకాశమూర్తి గురుమూర్తియే
విశ్వయోగి పలుకు తేనేలై చిలుకు

నాకమందైన మరి ఏ లోకమందైన ఆ
లోకోత్తముడు యజ్ఞ పురుషుడు అతి
లోక గురువు అత్ర్యానసూయలదత్తుడే
విశ్వయోగి పలుకు తేనెలే వొలుకు

అద్దముగా దివ్యముగ పరవాక్కు
ప్రతిబింబించు హృదయమ్మునందు
శాంతినింపు అమృతంపు గురువాక్కు
విశ్వయోగి పలుకు తేనెలొలుకు

# విశ్వయోగి మహిమ

- డా. పోతుకూచి సాంబశివరావు

మాటలోన మనసు, మనసుతోడనె మాట
మమత చిలుకు పలుకు మంచితనము
విశ్వధర్మమనుచు విశ్వానచాటారు
విశ్వయోగి మహిమ వినుడు మీరు

నిన్ను ఎపుడు నేను వెన్నెంటి వుందును
భయము వలదు నీకు భక్తి తప్ప
భక్తి కలుగువారు భగవాను బంధువుల్
విశ్వయోగి మహిమ వినుడు మీరు

చూపు ఎపుడు సూటి రూపుమనోహరం
తలపు పైనఉండు, తారవెలుగు
భూమిమీద వున్న పుణ్యమూర్తియె సాయి
విశ్వయోగి మహిమ వినుడు మీరు

అర్ధనగ్న యోగి, అర్ధ భగ్నము హృది
అర్ధమంతచర్య అమలు పరుచు
అడుగు అడుగునందు అందాల అర్థాలె
విశ్వయోగి మహిమ వినుడు మీరు

ఎవరు యోగి, ఎవరు భోగి, ఎవరు రోగి
చూపులోనే చెప్పు కాపు కాచు
నడక నీదిగాని నర్తన స్వామిదే
విశ్వయోగి మహిమ వినుడు మీరు

భక్తుడెదురు కాగ పట్టు కరము తోటి
స్పర్శతోటి మెరుపు శాంతినిచ్చు
శాంతితోటి సుఖము సద్భావమిచ్చురా
విశ్వయోగి మహిమ వినుడు మీరు

ఎచట వున్ననేమి ఎవరు చుట్టిననేమి
దూరదర్శనమున దురిత మణచు
నీదు బాధలరసి ఆదుకొనుసతమ్ము
విశ్వయోగి మహిమ వినుడు మీరు

కావ్యమన్న వినును కవులన్న ప్రేమయే
గీతములను కోరు ప్రీతి నెంచి
కళలపట్ల సాయి కనక పోషకులయ్యా
విశ్వయోగి మహిమ వినుడు మీరు

దత్త ప్రభువు, హితులు, దత్తావతారమే
చిత్తములను నిలిపి చేర్చుదరికి
ఆత్మశక్తినిచ్చు పరమాత్మ రూపురా
విశ్వయోగి మహిమ వినుడు మీరు

పాదమిలను కలదు భవ్యశిరమునింగి
పంచభూతములను పట్టికట్టు
విశ్వయోగి వెలుగు విశ్వాత్మజోతిరా
విశ్వయోగి మహిమ వినుడు మీరు

---

"గంగాజలం మీద పడే సూర్యకాంతే ఊరి బయట నికృష్ట జీవితం గడిపేవారిపైన కూడా ప్రసరిస్తున్నది కదా. బంగారు కుండలో వ్యాపించి ఉండే వాయువే మట్టికుండలోనూ ఉంటుంది కదా! ఇక మనుషుల మధ్య తేడాలు ఏమిటి? ప్రాణతత్త్వం అంతా ఒక్కటే అయినప్పుడు భేదబుద్ధి కలగటం తప్పు."

- ఆచార్య శంకరులు - మనీషా పంచకం.



# ప్రస్థానత్రయము

*ఓం నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్*
*దేవీం సరస్వతీం వ్యాసం తతోజయముదీరయేత్*
(మహాభారతము)

- *శ్రీతంత్రవహి జోగిరాజు*

ఉపనిషత్తులు, శ్రీ మద్భగవద్గీత, బ్రహ్మసూత్రములు మూడింటిని ప్రస్థానత్రయమందురు. బ్రహ్మసూత్రములు సూక్ష్మముగ ప్రతిపాదించిన వేదాంతతత్త్వమును శ్రీభగవద్గీత వివరించినది. ఉపనిషత్తులు వేదముల సారము. ఇవి వేదముల చివరి భాగమున నుండటచే వేదాంతమని పేర్కొందురు. సంసార సముద్రమున పరిభ్రమించు యాత్రికుని పరమ పదమును చేర్చుటకు సహాయపడు ధ్రువనక్షత్రము యీ ప్రస్థానత్రయము.

భగవద్గీత సాటిలేని ఒక అపూర్వగ్రంథము. ఇందలి ఉపదేశము సర్వశాస్త్రముల, సర్వధర్మల, ఉపనిషత్తులసారము. గీతను చక్కగా నధ్యయనము చేసిన చాలును. కారణము సర్వశాస్త్రములందలి తాత్త్విక విషయములను గీతయందున్నవి.

`గీయతి ఇతిగీతా'. గానము చేయబడునది గీత. దీనిని గీతోపనిషత్తని యందురు. ప్రపంచ సాహిత్యమున గీతతో సమానమగు గ్రంథము మరొకటి లేదు. కారణము శ్రీకృష్ణపరమాత్మ అర్జునకు బోధించినది, భగవాన్ వేదవ్యాసునిచే రచింపబడినది, అద్వైత రూపమున అమృతము వర్షించునది, పదునెనిమిది అధ్యాయములు, 700 శ్లోకములు గలిగినది, సంసార బంధములనుండి విముక్తి కలిగించు ఓ గీతామాతా! నిన్ను నేను ధ్యానించుచున్నాను. (గీతాభగవతీ ధ్యానము) గీతా గీతా యని పలుమారులు పలుకగా, తాగీ, తాగీగా మారి, మనలను త్యాగులు కావలిసినదిగా బోధించును.

భగవద్గీత యందు బ్రహ్మసూత్రములును, బ్రహ్మసూత్రములందు స్మృతిశబ్దముచే భగవద్గీతయుని నిర్దేశింపబడియున్నవి. శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులు భాష్యకారులైన నలుగురు దీనిని అంగీకరించుటచే బ్రహ్మసూత్రములు భగవద్గీత రెండును ఒకటే.

బ్రహ్మసూత్రముల కర్త, కృష్ణ ద్వైపాయనుడగు వేదవ్యాసుడగుటచే వీటిని వ్యాససూత్రములని కూడా పిలుతురు. ఇవి 4 అధ్యాయములు 556 సూత్రములు. ప్రథమాధ్యాయము సమన్వయము. ఇందు స్పష్టము, అస్పష్టము, సందిగ్ధములగు శ్రుతులు బ్రహ్మమందు సమన్వయముగా వింపబడెను. రెండవ అధ్యాయము అవిరోధము. దార్శనిక అభిప్రాయ దోషములను శాస్త్రోక్త పద్ధతిని, యుక్తుల సాయమున వేదాంత ఏకత్వము వివరింపబడెను. మూడవ అధ్యాయము సాధనము. సగుణ నిర్గుణముల లక్షణము వర్ణించి, ముక్తికి అవసరమగు అంతరంగ బహిరంగ సాధనముల వివరణ. నాల్గవ అధ్యాయము ఫలమున జీవన్ముక్తి, ప్రాణోత్క్రమణము, సగుణ, నిర్గుణ ఉపాసన ఫలములు, వాటి తారతమ్యము తెలుపబడెను. ఇట్లు ఈ వేదాంత దర్శనము ప్రతిపాదించు ముఖ్య విషయము బ్రహ్మప్రాప్తి.

మొదటి బ్రహ్మసూత్రము: "అథాతో బ్రహ్మజి జ్ఞాసా" అనగా సంసారము దుఃఖమయము, బ్రహ్మసాక్షాత్కారము లేక దుఃఖ నివృత్తి కాదు. కాన ప్రతి ముముక్షువు బ్రహ్మజిజ్ఞాస అనగా బ్రహ్మ విచారణ చేయవలెనని ఉపదేశించుచున్నది. జ్ఞానము లేదా త్యాగము వలననే సంపూర్ణ దుఃఖనివృత్తి ముక్తి కలుగును.

"నచక్షుషా గృహ్యతనాపి, వాచా నాన్యైర్దేవైస్తపసా
కర్మణావా జ్ఞాన ప్రసాదేర విశుద్ధ సత్వస్తతస్తుతం
పశ్యతే నిష్కలం ధ్యాయమానః" (ముండకోప నిషత్తు 3.1.8)

అది (బ్రహ్మము) కంటికి కనిపించదు. వాక్కుచే వర్ణింపబడదు. కర్మచేగాని, తపస్సుచేగాని గ్రహింపబడజాలదు. కేవలము జ్ఞాన ప్రసాదమున అంతఃకరణము పరిశుద్ధము కాగా మానవుడు ఆ నిరవయవుని ధ్యానించుచు సాక్షాత్కారము పొందును.

యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని
జీవన్తి, యత్ర ప్రయన్త్య భిసంవిశన్తి (తైత్త. ఉ. 8.11)

దేనివలన సమస్త చరాచర ప్రపంచముత్పన్నమగుచున్నదో, దేనిచేత సమస్త ప్రాణికోటి జీవించుచున్నదో, దేనియందు ఇదియంతయు లీనమగుచున్నదో అదే బ్రహ్మము.

ఉపనిషత్తులు జగత్తు ఉనికిని అంగీకరించక బ్రహ్మమొక్కటే సత్యమని చాటి చెప్పుచున్నవి. ఆదిశంకరులు తత్త్వసారమునంతయు అర్ధశ్లోకమున నుడివిరి. బ్రహ్మసత్యం, జగత్తుమిధ్య. జీవుడు బ్రహ్మమే.

"శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
బ్రహ్మసత్యం జగన్మిధ్యా, జీవో బ్రహ్మైవ నాపరః"

ఈ విషయమునే ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఈ సమస్త ప్రపంచము సృష్టికి మొదట ఆత్మయెకటి మాత్రమే యుండెను. ఇది యంతయు బ్రహ్మమే. ఆత్మయే ఇది అంతయును `సర్వం ఖల్విదం బ్రహ్మ. (ఛాందో ఉ. 3-14-1). ఇది అంతయు బ్రహ్మమే.

సగుణ నిర్గుణ భావములను వేదాంతమున బ్రహ్మము యొక్క స్వరూప లక్షణములు, తటస్థ లక్షణములుగా వర్ణింపబడినవి.

సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ (తైత్త. ఉ. 2.1.1)
బ్రహ్మసత్యం, జ్ఞాన స్వరూపము, అనంతము
విజ్ఞాన మానందం బ్రహ్మ (బృహ. ఉ. 3-9-28)
బ్రహ్మజ్ఞానం, ఆనంద స్వరూపం.

"తత్త్వమసి, అయామాత్మా బ్రహ్మ" యని బ్రహ్మ స్వరూప లక్షణమును సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జాలానితి (ఛాందో 3.14.1)

ఇందుత జ్జలా అనిన చోట తటస్థ లక్షణము. ఎట్లన తజలాన్, తజ, తల్ల, తదన్ అనగా ఆ బ్రహ్మము నుండి ప్రపంచ స్థితి కలిగి దానియందేవసించుచున్నది. మరియు అందే లీనమగుచున్నది.

ఏ ప్రయోజనము నాశించి ఈ సృష్టికార్యము జరుగుచున్నది అని ప్రశ్నించగా,

లోకవత్తు లీలాకైవల్యమ్ (బ్రసూ 2.1.33) సృష్టి కార్యము బ్రహ్మకు లీలలేక విలాసము మాత్రమే.

ఆయనకు ఎవరియందును పక్షపాతము లేదనుటకు ఈశ్వరుడు జీవుల

కర్మానుసారం సృష్టిని చేయుచున్నాడు. స్థూలదృష్టితో జీవుడు, బ్రహ్మ యిద్దరుగా కనబడుచున్నారు. ఇద్దరుగా కనపడుచున్నంతవరకు ఉపాసన, భక్తి, ధ్యానము, జ్ఞానము అవసరము. సుఖ దుఃఖములు, జరామరణ బంధనములు. ద్వైతభావము నశింప బంధమెక్కడిది? శోకమెక్కడిది? మోహమెక్కడిది? భక్తి యెక్కడిది? అన్నియు మటుమాయమై, ఆత్మసాక్షాత్కారమై సత్పథార్థ మొక్కటియే గోచరించును. ఏకత్వమనుభవించువాడు శరీరాది ఉపాధులు లేనివాడగుచు నిర్లిప్తుడు, శుద్ధ స్వరూపుడు, త్రికాలదర్శి, పూర్ణ బోధస్వరూపుడగుచు లోక శ్రేయస్సును, విశ్వశాంతిని కాంక్షించుచు,. జీవన్ముక్తుడుగా పరిగణింపబడును.

* ఓం తత్సమ్*

# గురువరేణ్యులు
# శ్రీయోగానందనరసింహమహర్షి

- శ్రీ వేమూరి చెన్నకృష్ణయ్య

నా చిన్న వయస్సులో నన్ను అక్కున చేర్చుకుని లాలించిన శ్రీ యోగానంద నరసింహ మహర్షి వారిని కడసారి 1950లో దర్శించి వారి దీవనల పొందగలిగాను 1962లో వారి జీవసమాధిని సందర్శించి మ్రొక్కులిడుకొని వచ్చాను. ఆపత్కాలంలో జపించుకొమ్మంటూ వారు నాకు మంత్రోపదేశం చేసిన మంత్ర రాజమును అప్పుడప్పుడు జపిస్తూ ఆ దేశికోత్తమునకు అంజలి ఘటించి ప్రార్థిస్తూ వుంటాను. ఇది నాకునూ నా గురుదేవులకునూ మధ్యగల సంబంధము ఈనాడు.

కొద్దిరోజుల క్రితం " విశ్వప్రకాశం" మాసపత్రికలో యోగానంద నరసింహమహర్షిని గూర్చి చదవటం తటస్థించింది. ఈ పత్రిక చదువుతుండగా ఆచార్య బిరుదురాజు రామరాజుగారు దివ్యయోగి చరితామృతం శీర్షికన శ్రీ యోగానంద నరసింహమహర్షిగారిని గూర్చి వ్రాసింది మద్గురు వరేణ్యుల గూర్చేనని అవగతమైంది ఆ క్షణం నాకు కలిగిన ఆనందానికి హద్దులు లేక పోయినాయి. ఆ వ్యాసం చదువుతున్నంత సేపూ మందస్మితవదనులై కాషాయాంబరధారియై ఒక బాలునివలె బుడి బుడి మాటలతో భక్తులందరినీ అలరింపచేస్తూ వచ్చిన దివ్యమంగళమూర్తి శ్రీశ్రీశ్రీయోగానంద నరసింహ యోగీంద్రులు నా కన్నులయెదుట సాక్షాత్కరించారు. వారినిలా దర్శించినంత కాలం శరీరం గగుర్పాటు చెందింది. కన్నులు ఆనందంతో చమర్చాయి. విశ్వప్రకాశానికి నమోవాకములర్పించుకొన్నాను. నాకు తెలిసిన మా గురుదేవుల దివ్యవైభవం విశ్వప్రకాశం పాఠకులకు తెలపాలనే కుతూహలంతో ఈ వ్యాసం వ్రాస్తున్నాను.

అవి నేను మార్కాపురం హైస్కూల్లో ఫస్టుఫారం, సెకండు ఫారం చదువుతున్న రోజులు. నా మాతామహుల ఇంటిలో వుండి విద్యాభ్యాసం చేస్తూ ఉండేవాణ్ణి. మా ఇంటి పక్క ఇంటిలో సీతమ్మ, ఆమె భర్త, వారి కూతురు రామలక్ష్మి ఉండేవాళ్ళు. సీతమ్మ తల్లిగారి గ్రామం తోకపల్లి. ఆయమ్మ

అన్నయ్య రామస్వామి, పూర్వాశ్రమంలో తోకపల్లి వాస్తవ్యుడు సుబ్బారాయుడూ, (యోగానంద మహర్షి) ప్రాణస్నేహితులు. చిన్ననాడు సీతమ్మగారు కూడా తన సోదరుడితో, సుబ్బారాయిడిగారితో ఇంకా తక్కిన సహ వయస్కులతో కలిసి చిత్రపట్టె, చిల్లకోలు, అట్లచెమ్మ, పులిజూదం మొదలైన ఆటలు ఆడుకున్న గడుసు అమ్మాయియే. సుబ్బారాయుడుగారు యోగీంద్రులుగా రూపుదిద్దుకున్నా తమ సోదరి సమాన అయిన సీతమ్మగ్గారిని మరచిపోలేదు. మా వీధికి రావడం తటస్థిస్తే శ్రీస్వామివారు సీతమ్మగారి గృహంమెట్టి వాళ్ళ పూజలందుకునిగాని ముందుకు వెళ్ళేవారుకారు.

మార్కాపురంలో శ్రీచెన్నకేశవస్వామి వారి తిరునాళ్ళు 15 రోజులు వైభవోపేతంగా జరుగుతుండేవి. శ్రీలక్ష్మీసమేతుడైన స్వామివారిని పొన్న చెట్టువాహనం మీద, గరుడ వాహనం మీద, వెల్లయేనుగ మొదలైన వాహనాల మీద ఊరేగించే సమయంలో చుట్టు ప్రక్కల గ్రామాల నుండి నూర్ల కొద్దీ ప్రజలు వచ్చేవారు. ఆ ఉత్సవ సమయాల్లో దేవదాసీలు చక్కగా పాడుతూ నృత్యం చేసేవాళ్ళు. ఆకర్షవంతములైన ఆ నృత్యగీతాలను తిలకించేవాళ్ళు కూడా చాలామంది వచ్చేవాళ్ళు. అప్పట్లో టౌనులో హోటళ్ళు లేవు. ధర్మశాలలు లేవు. మరి ఆ వచ్చిన ప్రజానీకానికి అన్నపానాలు సమకూర్చి ఆదరించేవారెవరు?

ఆ భారాన్ని యోగానంద ఋషీశ్వరులే వహించేవారు. శ్రీయోగానంద నరసింహ ఋషిపుంగవుని మఠం, ఆశ్రమం మార్కాపుర నగరానికి రెండు మైళ్ళ దూరాన అంటిపారుతున్న గుండ్ల మహేశ్వరీ తీరాన ఒక చిన్న కొండపై ఉన్నాయి. యోగానందస్వామి నిర్మించి ప్రతిష్ఠించిన నారసింహ ఆలయం కొండపై వుంది. కొండ కింద ఒక తోట, దానిలో పెద్ద చేంతాడు బావి, సాధు సన్యాసులు వచ్చి విశ్రమించేందుకు కొన్ని కట్టడాలూ ఉన్నవి. తిరునాళ్ళ రోజుల్లో శ్రీ శైలానికి వెళ్ళే శివరాత్రి పండుగ రోజుల్లో కొండ కింది తోటలో యాత్రికులు క్రిక్కిరిసి ఉండేవారు. వాళ్ళకు అన్నపానాదులు సమకూర్చే బాధ్యత యోగానందస్వాములవారిదే.

కొందరు శిష్యులను వెంట బెట్టుకొని స్వామివారు నగరంలోపలికి వచ్చి వాడ వాడలూ తిరిగి "రాత్రికి అన్నపూర్ణ కావళ్ళు వస్తాయి, యాత్రికులు చాలామంది ఆశ్రమంలో దిగారు, కాబట్టి మీ శక్తికొద్దీ అన్నమూ, కూరలు వేసి కావళ్ళు నింపి పంపించండి" అని ఆ వాడలోని పెద్దలకు ముఖ్యంగా స్త్రీ జనానికి చెప్పి వెళ్ళేవారు. రాత్రికి అన్నపూర్ణ కావళ్ళు రాగానే స్వామివారి ఆదేశానుసారం వాటిని నింపి పంపించేవాళ్ళు ఆయా వాడలలోని పెద్దలు. ఆ

తర్వాత ఆశ్రమంలో చేరి వున్న సాధుసన్యాసులను యాత్రికులను పంక్తులలో కూర్చుండబెట్టి అన్న పానాదులను వడ్డించేవాళ్ళు. కొన్ని సమయాల్లో యోగానాందస్వాముల వారే స్వయంగా వడ్డనా జరిపించేవారు.

ఒకసారి శ్రీచెన్నకేశవస్వామి తిరునాళ్ళు జరుగుతున్నాయి. ఆనాటి రాత్రి గరుడసేవ. యాత్రికులు లెక్కకుమించి వచ్చి చేరారు ఆశ్రమంలో. శ్రీ యోగానంద నరసింహమహర్షి యథా ప్రకారంగా భక్తులను అన్నపూర్ణ కావిళ్ళు నింపి పంపించమని ఆదేశించటానికి నగరంలోని వాడల్లో తిరుగుతూ వచ్చి మా వీధికి వచ్చారు. సుమారు నాలుగుగంటల సమయంలో సాయంకాలం సీతమ్మగారింటికి వచ్చారు.

ఆ సాధుపుంగవుడు వచ్చినాడని తెలియగానే మా వీధి వారందరూ సీతమ్మగారి ఇంటి ముంధు గుమికూడినారు. ఆ గుంపులో నేను దూరిపోయి స్వామీజీకి దగ్గరగా నిలుచున్నాను. సీతమ్మగారు స్వామివారితో మాటాడుతూ నన్ను చూపి మా మనవడు క్రిష్ణయ్య బలే బాగా పాడతాడు, కంఠం బాగుంటుంది అన్నారు. వెంటనే స్వామివారు నా చేయిపట్టుకుని " బాబూ పాడవయ్యా, నాకు సంగీతం అంటే చాలా ఇష్టం. ఏదీ ఒక పద్యం పాడు" అంటూ లాలించారు. నాకు మొదట భయం అయింది. సిగ్గు ముంచుకొచ్చింది. కాని సిగ్గు, భయం కాస్తా స్వామివారి లాలనలో కరిగి విరిగిపోయాయి.

రంగమార్తాండ కపిలవాయి రామనాథ శాస్త్రి పాటలూ పద్యాలూ ఆ రోజుల్లో బహుళ ప్రచారంలో వుండేవి. రామనాథ శాస్త్రి కన్నడ రాగంలో పాడిన పద్యాన్ని నేను పాడాను. ఆ పద్యం...

సీ. సర్వేశ్వరుండగు శౌరి గింకరుజేయ
ధనమున్నదే భక్తిధనము గాక
సర్వోపగతుండగు చక్రిబంధించెడి
బలమున్నదే భక్తి బలముగాక...

అనే పద్యం పాడటం ముగించగానే ఆ తపస్వి, ఆ భీమబలుడు నన్ను అమాంతంగా తమ రెండు హస్తాలతో పట్టి పైకెత్తి నిలిపారు. నాకు ఊపిరాడింది కాదు. మత్తేభతొండం చివర ఊగిసలాడే బిసకాండంలా వుండిపోయాను నేను. ' ఒరే బాబూ ఎంత బాగా పాడావురా!' అంటూ నన్ను కిందికి దింపి అంతటితో పోనివ్వక నా ముఖం వారి విశాల వక్షస్థలానికి

చేర్చి వీపు మీద మద్దెల మోగించినట్లు మూడు నాలుగుసార్లు చరిచారు. నాకు నొప్పి ఏ మాత్రం కలుగలేదు. కాని శబ్దం మాత్రం మృదంగ నినాదాన్ని తలపింపజేసింది. ఒక బాలుడు పట్టరాని సంతోష సమయంలో కేరింతలు కొట్టినట్లు చరుస్తూ సెహబాస్ అంటూ నిల్చిపోయారు స్వామివారు. అక్కడ చేరిన వారందరికీ ఆ పద్యంలోని భావం విపులీకరించారు. భక్తి ప్రభావం నొక్కి చెప్పారు. భగవంతుని దరిచేరాలంటే భక్తే ప్రధానము, ధనం కాని, ధనేతరం కానీ కాదని వాళ్ళకు ఉపన్యసించారు. నాతో మరోమారు 'ఒరే నాయనా ఎంతో బాగా పాడినన్ను ఆనందింపచేశావురా ' అన్నారు.

పద్యం పాడావు సరేగాని, పాట ఒక్కటి పాడుమన్నారు. అప్పుడు రామనాథశాస్త్రి విప్రనారాయణ నాటకంలో పాడిన పాట పాడాను. ' ఏదీ గతీ నాకు రంగా, రంగా ఏదీ గతీ నాకు ' అని నేనీ పాట పాడుతుండగా కన్నుల మూసికొని పరవశించిపోతూ ఆ పాట విన్నారు. 'బాబూ, నేనూ ఒకనాడు నాటకాల్లో వేషాలు వేసి పాటలు పాడాను. నృత్యం చేశాను, ఇప్పుడు నీవు పాడుతూ ఉంటే నాకు ఆ రోజులన్నీ మళ్ళీ జ్ఞప్తికి వస్తున్నవిరా' అన్నారు

మా తాతయ్యగారి అనుమతిని తీసుకుని నన్ను వారి వెంట ఆశ్రమానికి తీసుకవెళ్ళారు. నరసింహస్వామి వారికి తామే స్వయంగా పూజచేసి హారతి ఇచ్చారు. నాకు తీర్థప్రసాదాలు ఇచ్చారు, అక్కడ చేరి వున్న భక్తులతోపాటు. ఇద్దరం సహపంక్తిలో కూర్చోని భోంచేశాము. భోజనానంతరం మఠం ఆవరణలోని ఒక బల్లపరుపురాతిపై కూర్చున్నాము. "బాబూ! నాకేమో ఈ రోజు నీవు పాడుతూ వుంటే వినాలని వుంది. నీకు వచ్చిన పాటలు, పద్యాలు పాడు క్రిష్ణయ్య" అన్నారు. ఆ విశాల హృదయుని ఆదరాభిమానాల అమృతపు జల్లులతో నాకు బిడియంకాని, భయంగాని తోచింది కాదు. కపిలవాయిపాటలూ, పద్యాలూ, సి.ఎస్.ఆర్. ఆంజనేయులు పద్యాలూ, జొన్నవిత్తుల శేషగిరిరావు పద్యాలూ... ఆనాడు గ్రామఫోను రికార్డుల్లో రికార్డై ఎక్కువ ప్రచారంలో వున్న పాటలూ పద్యాలూ... పాడినాను. కొండ క్రింద తోటలో వున్న కొందరు వినటానికి మా దగ్గరికి వచ్చిచేరారు. నేను పాడుతూ వున్నంతసేపు ఆ పరమ యోగీంద్రులు నా వీపుని నిమురుతూ నిమీలిత నేత్రులై తన్మయ చిత్తులైవింటూ వచ్చారు. చాలారాత్రి పొద్దుపోయిన తర్వాత మఠం ముందరిహాలులో ఇద్దరం ఒకచోట పడుకొని నిద్దురపోయాము.

వారు బ్రహ్మ ముహూర్తంలో నిద్రనుండి లేచి ఆసనాలు వేసి ప్రాణాయామం చేసుకొని, జపధ్యానాదులను ముగించి నన్ను నిద్దర నుంచి

లేపారు. వారు ప్రాణాయామం చేసే సమయంలో నే నాకు మెలుకువ వచ్చి వారు చేసే ప్రతి కార్యక్రమాన్ని చూస్తూనే ఉండిపోయాను. నాకు వేడి నీళ్ళు పెట్టించారు. స్నానం చేసిన తర్వాత నరసింహస్వామివారి తీర్థ ప్రసాదాలు నాకందజేశారు. ఆలస్యమైతే మా మాతామహులు బెంబేలు పడతారేమోనని ఒక శిష్యుణ్ణి నాకు తోడుగా ఇచ్చి ఇంటికి పంపించారు. ఆనాటి సంఘటన నాకు మధుర స్మృతిగా మిగిలిపోయింది.

యోగీంద్రులు ఎప్పుడూ ఏవో దూరపు ప్రదేశాలకు వెళ్ళుతూ ఉండేవారు. భక్తులు వచ్చి వారిని ప్రార్థించి తమ వెంట తోడుకొని వెళ్ళేవారు. వారు ఆశ్రమంలో ఉంటే మాత్రం స్వయంగా వెళ్ళి వారిని దర్శించి దీవనలను పొంది వస్తూండేవాణి.

అనంతపురంలో కాలేజీ చదువుల్లో నాలుగేళ్ళు గడపవలసి వచ్చింది. ఆ తర్వాత ఉద్యోగంలో చేరి మార్కాపురం వెళ్ళడానికే ఆస్కారం లేకపోయింది. ఇలా ఏండ్లూ పూండ్లూ గడచిపోయాయి. వారి సందర్శన భాగ్యం నాకు కలిగింది కాదు.

1950లో మార్కాపురం పోవడం తటస్థించింది. వెళ్ళిన వెంటనే ఋషిపుంగవులు ఆశ్రమంలో ఉన్నారా! లేరా అని విచారించాను. శ్రీ వారు ఉన్నారని తెలియవచ్చింది. మరునాడు ఉదయమే వెళ్ళి వారి దర్శనం చేసుకోవాలని కృతనిశ్చయుడనయ్యాను.

నేను ఇలా నిశ్చయించుకున్న ఒక గంటలో ఎలా తెలుసుకోగలిగారో ఆ మహితాత్ముడు "ఏడీ మా క్రిష్ణయ్యా! వచ్చిండంట గదా" అంటూ మా ఇంటి ముందర నిలిచారు. పరుగు పరుగున వెళ్ళి వారి పాదపద్మములపై వ్రాలిపోయాను. నిర్హేతుకంగా కన్నులవెంట నీరు వెల్లువలై కారుతూ వారి చరణ కమలముల తడిపివేస్తున్నవి. ఇవ్వాళ్ళ వరకు దొంగనై, దూరస్థుడనై స్వామి వారిని దర్శించలేకపోయిన దుశ్శీలుడను గదా! అన్న భావం నన్ను పీడించసాగింది. అందుకే కాబోలు నాకు కన్నులలో ఆ కః

స్వామీజీ తమ పావనహస్తాలతో నన్ను గ్రుచ్చిఎత్తారు. చిత్రమేమిటీ అంటే వారి కన్నులు కూడా చమర్చినవి. కన్నీళ్ళు ధారగా ఒక్కటొక్కటి జారిపడిపోతున్నాయి. ఇద్దరి మధ్య కనుచూపులేకాని మాటలు పెగిలిరాలేదు. నా చేయి తమ దివ్యహస్తానగిలించి సీతమ్మగారి వరండాలోనికి గొనిపోయినారు. ఇంతలో అక్కడ చేరిపోయిన మా వీధివాళ్ళు విస్తుపోయి చూస్తున్నారు

మూగ నోము పట్టిన మా ఇద్దరినీ.

స్వామివారే సంభాషణ ప్రారంభించారు. " క్రిష్ణయ్యా! పోలీసు ఉద్యోగం ఎట్లా వుంది? నీ ప్రవృత్తికి ఆ ఉద్యోగం అంతగా సరిపడదేమో అని అనుకుంటాను" అంటూ ఒక్క మాటలో నా అభిమతానికి నచ్చినట్లుగా వ్యాఖ్యానించారు. మాట్లాడుతూనే నా చేయి మళ్ళీ పట్టుకుని వీపు నిమురుతూ ఎలాగైనా నన్ను నవ్వించాలని నన్ను కవ్విస్తూ తమ మంజువాచాలతతో లాలిస్తూనే వున్నారు.

" సరే. క్రిష్టయ్యా. నీవు దొంగలను పట్టుకోవడానికి ఇప్పుడు ప్రయత్నిస్తున్నావు కదూ! మరి నేను దొంగలను పట్టుకొని వాళ్ళ తలలు చిదుగబొడిచి పోలీసులకు అప్పజెప్పాను. ఆ కథ చెప్పమంటావా?" అన్నారు నేను చెప్పమని తలవూపాను. "స్వామీ! చెప్పండి స్వామీ!" అన్నారు అక్కడ పోగైనవాళ్ళు.

*అప్పుడు ఆ యోగానందస్వామివారు చెప్పిన గాథ.*

"క్రిష్టయ్యావిను! చిన్నప్పుడు ఒకసారి నేనూ ఈ సీతమ్మ అన్నగారు రామస్వామీ మరి ఐదారు మంది స్నేహితులం కలిసి శివరాత్రి పండుగ కని శ్రీ శైలం పోయివాము. పోతూ పోతూ శిఖర దర్శనం చేసుకున్నాము. మల్లికార్జునయ్యకు పాదధూళి సేవ చేసుకున్నాము. మరునాడు పాతాళగంగలో స్నానం చేసి మల్లయ్యను దర్శించినాము. పాలధారా, పంచధారా, పుణ్యతీర్థం సేవించినాము. ఆ మర్నాడు కొండమీది నుంచి మా తోకపల్లెకు ప్రయాణం అయ్యాము. మా వెంట ఒక గుంటూరు వకీలు, ఆయన భార్యాపిల్లలు అక్కసెల్లెండ్రు, బావ, బావమర్దులు అంతా కలిసి పది పన్నెండు మంది తోడుగా "మీరు వెంట ఉంటారు మీ వెంట వస్తాము" అన్నారు. నేను వారిని అట్లాగే రమ్మన్నాను. అందరం కలిసి అడవిలో నడిచి రాత్రికి దోరణాల చేరుకున్నాము. రాత్రికి అక్కడే నిలిచిపోయాము. వాళ్ళంతా బాగా అలసిపోయారు. మరునాడు ఉదయం మాతో ప్రయాణం చేయలేకపోయారు. వాళ్ళకోసం మా స్నేహితుల మందరం నిలిచిపోయాము. మిట్టమధ్యాహ్నం భోజనాలు అయిన తర్వాత కొంచెం పొద్దు వాటాలిన తర్వాత అందరం బయలుదేరాము.

మాకంటె ముందుగా బయలుదేరిన వాళ్ళు, వెనుక బయలుదేరినవాళ్ళు, రోడ్డు వెంట నడచివెళ్తున్నారు. మేము మా తోకపల్లికి ఇంకా ఏడెనిమిది మైళ్ళదూరంలో ఉండగా రోడ్డుకు రెండు పక్కలా చేలల్లో నుంచి అరుపులు,

ఏడ్పులు, ఆర్తనాదాలు వినపడుతున్నవి. దొంగలు యాత్రికులను పట్టుకొని చేలల్లోకి తీసుకొని పోయి వారిని ఏడ్పిస్తున్నారని మాకు అర్థమైంది. తొందర తొందరగా ముందుకు నడిచిపోతున్నాము. చేలల్లో నుంచి ఏడెనిమిది మంది మా దగ్గరకి పరుగెత్తుకొని వచ్చి "నిలువండి, లేకపోతే చావమోదుతాం" అన్నారు మేము నిలిచిపోయాము మమ్మందరినీ బట్టలన్నీ అక్కడే విప్పించి చేలోకి నడువమన్నారు. సిగ్గుతో బట్టలు విప్పటం ఆలస్యం చేస్తుంటే, వకీలును, ఆయన వాళ్ళందరినీ వంగబెట్టి గుద్దుతున్నారు ఆడవాళ్ళను కూడా కొడుతున్నారు. నేను ఆలోచించినాను. నా పంచె విప్పి బాణాకర్ర పట్టుకొన్నవానికి తలపైవేసి వాడు నా పంచె పక్కకు తీసేంత లోపలనే వాని బాణాకర్ర లాక్కున్నాను వెంటనే వాళ్ళపై "వీరాంజనేయా, ఉగ్రనరసింహా, జైజై" అని పొలికేకలు వేస్తూ విరుచుకపడి బాణాకర్రతో కొట్టసాగినాను. ఒకనికి తల చిట్లిపోయినది. రక్తం కాలువలైపారి వాడి అంగీ, పంచా తడిసిపోయాయి.

నాతోపాటు నా స్నేహితులూ వాళ్ళ మీద పడ్డారు. మా ధాటికి ఆగలేక ఆ దొంగలు పరుగులంకించుకున్నారు. కొంతదూరం వాళ్ళను తరిమాము. చేలల్లోకి వాళ్ళు పారిపోయినారు. పొద్దుకుంకిపోయింది. అప్పుడు మేము వకీలుగారికీ వాళ్ళ బంధువులకు విప్పిన బట్టలు ఇచ్చి వాళ్ళు బట్టలు కట్టుకొన్న తర్వాత త్వరగా నడిపించుకొని పోయాము మాతో మరికొందరు యాత్రికులు కలిశారు. అందరం సురక్షితంగా తోకపల్లె చేరుకున్నాము.

యాత్రికులందరూ కలిసి సుమారు 50 మంది అయ్యారు. వాళ్ళలో కొందరికి బట్టలు లేవు. వాళ్ళ బట్టలు, నగలు, నగదూ దొంగలు లాగేసుకున్నారు ఆడవాళ్ళు కొందరు తుండుగుడ్డలు కట్టుకుని వున్నారు. వాళ్ళ అవస్థ చూడలేకపోయాము. మా పల్లెలో ఇంటింటికి తిరిగి పంచెలు, చీరలు, అంగీలు, రవికలూ వసూలు చేశాము. వాటిని బట్టలు లేనివాళ్ళకి పంచి పెట్టాము. మా గ్రామస్థులందరూ బీదలు. వంటకు తగ్గపరికరాలు అందివ్వలేరు. శెట్టిగార్లకు దొంగల దాడి తెలిసి కావల్సిన బియ్యం, బాళ్ళు, ఉప్పు, చింతపండు సరఫరా చేస్తే మరునాడే భిక్షమెత్తైనా తీరుస్తాం అని వాళ్ళను బతిమిలాడాను. నేనంటే వాళ్ళకు మంచి విశ్వాసం ఉండేది. ముద్దు ముద్దుగా పిడుగు సుబ్బారాయుడూ అనేవాళ్ళు నన్ను. కావలసిన బియ్యం, బాళ్ళు, ఉప్పు, కారం, చింతపండు ఇచ్చారు శెట్లు మా ఊళ్ళో వంట వచ్చినవాళ్ళందరూ కలిసి యాత్రికుల కోసం వంటలు చేసినారు. వడ్డన్లు మొదలుపెట్టారు.

ఈ గందరగోళంలో పగ తీర్చుకోవడానికి చాలామంది దొంగలు పో
గ్రామం మీద పడి దొంగేటుగా ఇళ్ళకు నిప్పుపెడితే ఊరంతా మం

మసైపోతుంది. ఈ విషయం నా స్నేహితులతో ఆలోచించి గ్రామంలో నా ఈడు వారందరితో కలిసి కాపలా కాచాను. మేము అనుకున్నట్లు చాలామంది దొంగలు ఊరి సివార్లలోకొచ్చి ఏమి చేద్దామా అని ఆలోచిస్తున్నారు.

నేను వీరాంజనేయా, ఉగ్రనరసింహా అని పొలికేకలు వేసివాళ్ళ మీద పడిపోయాను. నా స్నేహితులు కూడా పెడబొబ్బలు పెడ్తూ బాణాకర్రలతో వాళ్ళ మీద విరుచుకపడ్డారు. వాళ్ళకు దిక్కు తోచింది గాదు. అటూ ఇటూ పరుగెత్తారు. ఇద్దరు మాకు దొరికిపోయారు. తక్కినవాళ్ళు చీకట్లో తప్పించుకపోగలిగారు. దొరికిన ఆ ఇద్దర్నీ పెడరెక్కలు విరిచి కట్టి గ్రామచావడిలో పడేశాము.

ఆ రాత్రి ప్రశాంతంగా గడచిపోయింది. ఉదయమే నేనూ నా స్నేహితులం కలిసి చుట్టు ప్రక్క గ్రామాలకు వెళ్ళి దొంగలదాడుల విషయం చెప్పి వారి సహాయం అర్థించాము. వారందరికీ ముందుగానే దొంగల దౌర్జన్యం, దానిని మేము అరికట్టిన విధానం తెలిసిపోయింది. తమ తమ శక్త్యానుసారంగా సహృదయంతో డబ్బు ఇచ్చారు. కొందరు మంచి మంచి చీరెలు, అంగీలు వగైరా ఇచ్చారు. వాటిని యాత్రికులకు పంచి పెట్టాము. మొదట నేను శెట్టిగార్లు బియ్యం, పప్పూ సరఫరా చేసినందుకు అయిన అప్పును తీర్చివేశాను. కొంత డబ్బు మిగిలిపోయింది. కొంత డబ్బు యాత్రికులకి ప్రయాణం ఖర్చుకోసం పంచిపెట్టాము. అన్నం వండించి సద్దులు కట్టి ఇచ్చాము. యాత్రికులందరిని సగౌరవంగా పంపించాము. వాళ్ళందరూ మమ్ముల పేరు పేరునా పిలిచి తమ కృతజ్ఞత చెప్పుకొని మమ్మందరినీ దీవించి వెళ్ళారు. ఆ తర్వాత మార్కాపురం నుంచి పోలీసు ఇన్స్పెక్టరూ, కానిస్టేబులూ వచ్చి మేము పట్టికట్టి వేసిన దొంగలిద్దరినీ తమ స్వాధీనంలోకి తీసుకున్నారు. మేము దొంగలను ఎదుర్కొన్నందుకు చాలా సంతోషించారు పోలీసు ఆఫీసర్లు. 'కిష్టయ్యా!' ఏమంటావు! ఆ రోజుల్లో నేను ఎవరు అన్యాయం చేసినా వాళ్ళమీద ఎదురు తిరిగి బుద్ది చెప్పేవాణ్ణి. తలపొగరు వాళ్ళన్నా, అబద్ధాలు ఆడేవాళ్ళన్నా, దౌర్జన్యం చేసేవాళ్ళన్నా నాకు బొత్తిగా గిట్టేది కాదు. బీదవాళ్ళకూ నోరులేని అమాయకులకూ సహాయం చేసేవాణ్ణి. ఇట్లాగా నా పల్లెటూరి జీవితం అంతా గడిపాను 'కిష్టయ్యా' అన్నారు స్వామివారు చిరునవ్వుతో కన్నుగీటుతూ. అసంసప్తక యోధుణ్ణి నేనెలా స్తుతించగలను! "స్వామీ మీరు దొంగలను తరిమికొట్టి దుష్టశిక్షణ చేశారు. యాత్రికులకు ఎనలేని సహాయం చేసి శిష్టరక్షణ చేశారు. మీరు కారణజన్ములు. ఆనాటి నుండే మీలో అంతర్లీనమైవున్న యోగీశ్వరుడు తన దివ్యలీలలు సమయానుకూలంగా ప్రదర్శిస్తూ వచ్చాడు. ఇంతకంటే

నేనేమనగలను స్వామి"  అంటూ అంజలి ఘటించి పలికాను.

చిరునవ్వు నవ్వుతూ నా చేయి పట్టుకొని"  రా, మఠానికి పోదాం, రేపు పొద్దున్నే ఇంటికి పంపిస్తానులే  " అన్నారు. ఇద్దరం కలిసి మఠానికి వెళ్ళాము.

శ్రీనరసింహస్వామి విరాట్ రూపానికి పూజ చేసి నాకు తీర్థ ప్రసాదాలిచ్చారు. ఇద్దరం సహపంక్తిలో కూచిని భోంచేశాము. నేను పెద్దవాణ్ణి అయ్యానని తలచారేమో! స్వామి వారు నన్ను పద్యాలు కాని, పాటలుకాని పాడమనిన వారుకారు. భగవద్గీత నిత్యం పారాయణం చేస్తూ వున్నానని నేను చెప్పగా చాలా సంతోషించారు. భగవద్భక్తి పెంచుకొమన్నారు. ఆధ్యాత్మిక సంబంధంగా కొంత ముచ్చట జరిగింది. నా సందేహాలకు సమాధానం చెప్పి నన్ను ధన్యుణ్ణి చేశారు స్వామివారు.

తెల్లవారకట్ల స్నానం చేసిన తర్వాత ఆపత్కాల సమయంలో జపం చేసుకొమ్మంటూ ఉగ్ర నరసింహమంత్రోపదేశం చేశారు నాకా మహితాత్ముడు. ఈనాటికీ ఆపూత చరిత్రుని ఆదేశం పాటిస్తూనే వున్నాను.

**1962**లో మార్కాపురం వెళ్ళాను. స్వామివారి జీవసమాధికి సద్భక్తితో ప్రదక్షిణ నమస్కారాలు చేసి ధన్యుడిగా భావించి తృప్తి చెందాను. ఈనాడు శ్రీఆచార్య బిరుదు రామారాజుగారి వ్యాసంలో చదువుతూ ఉంటే ఆ మహాయోగీంద్రుడు నా కనులమందు నిలిచినట్లు అనుభూతి చెందాను.

ఇదొక మహద్భాగ్యంగా అనిపించింది. *

## సత్యవచనం

\- జి. శ్రీ శైలం

సత్ప్రవర్తనలతో
నిరంతరం శ్రమించే
విశాల హృదయానికి
ఆ దివ్యశక్తి
ఆశీస్సులుంటాయి
భక్తి విరియగ
అఖిలలోకాలు
భాసిస్తుంటాయి

# భగవాన్ శ్రీరమణులతో పరమహంస యోగానంద

29 నవంబరు, 1935 స్వామి యోగానందులు నల్గురు పరిచారకులతో ప్రొద్దునగం. 8.45 లకు వచ్చి చేరారు. దీర్ఘకాయుడు, సౌమ్యుడు, సంస్కారం కలవాడు, నల్లని పొడవైన జుట్టు భుజాల క్రిందికి జారుతున్నది. ఆశ్రమంలోనే వారి భోజనాదులైనవి.

ఆయన కార్యదర్శి సి.ఆర్. రైట్స్ (Wright) అడిగినారు - దైవానుభూతినాకెట్లు కల్గును?

మహర్షి: దైవ ప్రమాణం ఇంతని తెలియరాదు. పైపెచ్చు అతడు మనలో వాడుకాడు. బాహ్యస్థితుడు. ఆత్మయంటేనో నీతోనే సదా ఉంటుంది. అదినీవే. అంతదగ్గర దాన్ని వదిలి, దవ్వైన దానికై ప్రాకులాట ఎందుకు?

ప్రశ్న: ఆత్మ అంటే ఏమి?

మహర్షి: ఆత్మ అందరెరిగినదే, కాని స్పష్టంగా మాత్రం కాదు. నీవెప్పుడూ ఉన్నావు. ఆ ఉన్నదే ఆత్మ. ``అహమస్మి" అదీ దైవం పేరు. దైవ నిర్వచనాలన్నిటిలో ఒప్పినది బైబిల్ (Exodus, Chap.3) లోని `నేనది నేను' I am that I am బ్రహ్మైవాహం, అహం బ్రహ్మాస్మి, సోహం అన్న వచనాలూ ఉన్నవి. కాని మిక్కిలి సూటియైనది ``జెహోవా" నేనున్నాను. ఉన్నది బ్రహ్మమే- అదే `ఆత్మ' అదే దైవం. తన్నెరుగుట దైవాన్నెరుగుటే. నిజానికి దైవం ఆత్మకు వేరుగాదు.

ప్రశ్న: పుణ్య పాపములేమి? అవి ఎందుకున్నట్లు?

మహర్షి: అవి సాపేక్షాలు. అంటే ఒకటిని, ఆ రెండవ దానితో పోల్చి తెలియవలసింది. పాపపుణ్యాలు తెలిసికొనే కర్త యొకడుండవలెగా? ఆ కర్త అహంకరణ - అహంకరణ మూలం కనిపెట్టు. అది ఆత్మ'యైతే తేలుతుంది. ఆత్మమూలం, దైవం. దైవానికి ఈ నిర్వచనం స్థూలంగా.

నీకర్థమయేట్టుగా ఉన్నదా?

పృచ్ఛకుడు: ఉన్నది. ఆనందాన్ని పొందేదెట్లు?

మహర్షి: అది పొందవలసింది గాదు, నిత్యానందం నీవే. ఏదో కొరత పడ్డదన్న చింతయె కోరికకు కారణం. ఈ అసంపూర్ణత, అసంతృప్తి ఎవరికి? విచారించు. గాఢ నిద్రలో నీవు సానందుడవే. ఇప్పుడట్లు లేవు. ఆయానందానికీ ఇప్పటినిరానందానికీ నడుమ ఏమడ్డు వచ్చింది? అది అహంకరణ. దాని ఆధారం వెదకితే ఆనందం నీవేనని కనుగొంటావు.

సంపాదించటానికి అది క్రొత్తగాదు. ఆనందానికి నీవు దూరమన్న అజ్ఞానాన్ని త్యజించు. ఈ అజ్ఞానమెవరికి? అహంకరణకు. దాని మూలమన్వేషించు. అప్పుడహంకరణమదృశ్యమై ఆనందము మిగులుతుంది. ఆనందము నిత్యం. ఇప్పుడూ ఎప్పుడూ అది నీవే. సకల సందేహాలూ తీర్చే కీలకమిదే. సంశయాలు మనస్సులో జనిస్తవి, మనస్సు అహంకరణలో అహంకరణ ఆత్మలో పుట్టుతవి. అహంకరణ జాడపట్టి దాని ఆదికి వెళ్ళు. ఆత్మసాక్షాత్కరిస్తుంది. సర్వశేషి అదే. ఆత్మవిస్తరణయే జగత్తు. అది అత్మకభిన్నము.

పృచ్ఛకుడు: అత్యుత్తమ జీవనమెట్లు?

మహర్షి: జ్ఞానికో, అజ్ఞానికో దానినిబట్టి. జ్ఞానిదేనినీ ఆత్మకన్యంగా చూడడు. అన్నీ ఆత్మలోనివే. ఈ జగత్తు నిజమనీ, దానిలో నొక శరీరమున్నదనీ అందు నీవు వసిస్తున్నావనీ- ఈ యూహలన్నీ పొల్లులే. సత్యమెరిగిన పిదప సృష్టి దానికవ్వలిదే. సర్వమూ ఆత్మలోనివే అని స్పష్టమౌతుంది. దృష్టి భేదము వల్ల విషయభేదము. చూపుకంటి నుంచి, కంటికి ఒక స్థానముండవలె. చర్మచక్షువులతో చూస్తే దృశ్యాలు స్థూలాలుగానే ఉంటవి. సూక్ష్మచక్షులతో (మనస్సుతో) నైతే ఒరులు సూక్ష్మలుగానే గోచరిస్తారు. ఆత్మయే కన్నైనపుడు ఆత్మ అనంతం గనుక కన్నూ (చూపూ) అనంతమే. ఆత్మకు భిన్నంగా చూచుటకేమీ ఉండదు. ఆయన మహర్షికి కృతజ్ఞత తెల్పినారు. 'అత్యుత్తమైన కృతజ్ఞత ఆత్మగా నుండుటే' అన్నారు మహర్షి.

యోగానందులు: జనులను ఆధ్యాత్మికంగా ఉద్ధరించుటెట్లు? వారికి ఇవ్వవలసిన శిక్షణ ఎట్టిది?

మహర్షి: అది వారి వారి మనస్థితులను బట్టి. ఆధ్యాత్మికంగా వారి వారి పరిణతిని బట్టి ఉండవలె. మూక ఉమ్మడిగా శిక్షణయేమి?

ప్రశ్న: ప్రపంచంలో ఇంత దుఃఖాన్ని దైవమేల అనుమతించినాడు? సర్వశక్తి గదా? ఒక్క వ్రేటులో సర్వ దుఃఖములూ నిర్మూలించి సమష్టిగా ఆత్మలబ్దిననుశాసించరాదా?

మహర్షి: బ్రహ్మానుభూతికి మార్గము, ఆర్తి.

ప్రశ్న: మరో విధంగా ఆదేశించరాదా?

మహర్షి: దానికదే మార్గం.

ప్రశ్న: యోగము, మతమూ మొదలైనవి దుఃఖ నివారకాలా?

మహర్షి: వానివల్ల బాధను గడవబెట్ట వచ్చును.

ప్రశ్న: అసలు బాధ ఎందుకుండవలె?

మహర్షి: ఎవరా బాధపడేది? బాధ అంటే యేమి?

బదులు రాలేదు. చివరకు యోగానందులు లేచి తాము పూనిన కార్యము విజయవంతమగుటకు భగవాన్ అనుగ్రహం వేడినారు. అంత త్వరగా తాను వదిలి పోవలసినందులకు సంతాపం తెలిపారు. ఆయన ఋజువర్తనులుగా, భక్తిపరులుగా, కొంత ఉద్విగ్నులుగా కన్పించారు.

- శ్రీరమణ భాషణములు పుట 112-115

"అత్యంత కాముక స్యాపి వృత్తిః కుంఠతి మాతరి
తథైవబ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః"
_ శంకర భగవత్పాదులు - వివేక చూడమణి

ఎంత కాముకుడైనా తల్లి ముందు తల యెత్తలేనట్లు బ్రహ్మజ్ఞానియైన యోగి దుఃఖ భాజనమైన సుఖాల నపేక్షించడు కదా!

# వృత్తిధర్మం - వృత్తి గౌరవం

- డా. శ్రీతిరుమల రామచంద్ర

వృత్తిపైన గౌరవం, సత్యనిష్ఠ, సహృదయతగల సచ్ఛీలురతో కలిసి పనిచేసే అవకాశం ఎల్లప్పుడూ కలుగడం నా అదృష్టం. నేను డజను వృత్తులు కోరికి చూచి, చివరకు పత్రికారచనలో స్థిరపడ్డవాడిని. ప్రతి వృత్తిలోను నాకు మంచివాళ్లే వరిష్ఠులు, కనిష్ఠులు అయ్యారు.

హోటలు అనుభవం ఎలా ఉంటుందో చూద్దామని వుందిసార్!- అని నీళ్ళు నమిలాను ప్రభాకర గురువర్యు (వేటూరి ప్రభాకర శాస్త్రిగారి)ల వద్ద ఒకమారు. నన్ను ఎగాదిగ చూశారు. "అదేదో తక్కువ పని అని, నీవేగొప్ప పండితుడివని, ఆ వృత్తిని అనుగ్రహిద్దామని అనుకుంటున్నావా? నిజంగానే అనుభవం పొందుదామని ఉందా?" అనడిగారు ఆయన. నిజంగా చిత్తశుద్ధితో- అన్నాను. "సరే దానికేముంది? సింగరాచారి వీధి (తిరువల్లిక్కేణి, మద్రాసు) లోని రామవిలాస్ హోటలు యజమాని ప్రేయరుకు రోజూ వస్తారుగా, చెబుతాను-" అన్నారు ఆయన.

రామవిలాస్ హోటల్ పెద్దది. ఒక సత్రమన్నా తప్పులేదు. ఐదారు వందలమంది భోజనం చేసేవారు. ఫలహారాల శాఖవేరే. నేను హోటలులో పని చేస్తానని విని ఆ యజమాని ఎగిరి గంతు వేశాడు. మహా సజ్జనుడు. విడి భోజనం నాలుగణాలు. నెలకయితే పది రూపాయలు. తెలుగువారికీ, తమిళులకూ రుచించే వ్యంజనాలు, కమ్మటి నేయి, ప్రేమతో వడ్డన. వల్లభ రాయడు చెప్పిన లక్ష్మణ వర్ధ్ముల యింటి భోజనంకన్నా బాగుండేది. "ఇదిగో చూడండి. నా సంసారం, సిబ్బంది ఖర్చుపోను నాలుగణాల లాభం వస్తుంది. అంతేచాలు. ఇదే అన్యాయం? ఇంతకన్నా దిగజారామా మహా పాపం!" అనేవాడు యజమాని. సిబ్బందికి ముప్ఫై రూపాయల నెలజీతం. రెండు పూట్ల ఫలహారం, రెండు పూట్ల భోజనం, వారానికి ఒకసారి మిగిలిన మిఠాయిల వాటా, వారానికొకసారి తలంటుకు నూనె, సీకాయ, దీపావళికి, తమిళ సంవత్సరాదికి కొత్త బట్టలు... ఇంతకన్నా సర్వీస్ కండిషన్స్ మంచివి ఎక్కడుంటాయి?

నాతో సంవత్సరం ఉండండి. ఊరికే పైపార్వై (సూపర్‌విషన్)

చేస్తూండండి. అణా వాటాయిస్తాను... అన్నాడు. ఇదంతా నా గొప్పదనం కాదు. గురువర్యుల సిఫార్సుబలం.

** ** **

మిలటరీలో చేరాను. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో. అందరూ తిట్టారు- ఇదేం పోయేకాలమని. నా పంజాబీ నెచ్చెలి రాజో అయితే ఏడ్చేసింది. "సోణియా, మరి తిరిగివస్తావా? తెన్నుకీ హో ఆ? అంతాగురు కిర్పా-" అన్నది. 'ఇదేమిటి? మీ పంజాబీ పంకజాక్షులు వీరాంగనలు, నన్ను వెనక్కు లాగుతున్నావే?' అన్నాను. తనదాకా వస్తేగానీ తెలీదంటారు గదా! నీవు నాకు ఆత్మీయుడివి. నాకు తోడబుట్టులెవ్వరూ లేరు. మా ఇంట్లో రెండేళ్లుగా అద్దెకున్నావు. నీ ప్రవర్తన బాగుంది. కనుక నీ బోటి మిత్రుడు మరీ దొరుకుతాడా? అంది గుడ్లనిండ నీళ్ళతో.

మానవత్వం ప్రపంచంలో ఎక్కడున్నా ఉందీ అంటే అది మిలటరీలోనే వుంది. అందరూ ఒకే లక్ష్యంతో ఉండేవాళ్లాయిరి. సుఖదుఃఖాలు సమానమాయిరి. కనుక సౌభ్రాత్రం, పొంగిపొర్లుతూ వుంటుంది. వృత్తి ధర్మపాలన మిలటరీలో వున్నట్లు మరెక్కడా లేదేమో అనిపిస్తుంది. అందరి ఎదుట మృత్యువు తాండవిస్తూంటుంది. కనుక న్యాయమార్గం దాటిన క్షణం వుండదు. భగవంతుని తలవని క్షణం వుండదు. భగవాన్! యా అల్లా! వాహే గురూ! ఓ గాడ్! అని హృదయం చించుకొని వస్తాయి. మంచి జరిగినా, చెడు జరిగినా.

ఒకమారు స్టేషను వాగనులో చమన్ నుంచి శీలాబాగ్ (భారత్ - ఈరాన్ - ఆఫ్ఘన్ సరిహద్దు) వెళ్లుతున్నాము. స్టేషను వాగనులో డ్రైవరు కాక నలుగురున్నాము. కొంత సామాను ఉంది. దారి కొన్ని వేల అడుగుల మీది కొండల అంచులలో ఒక లారీ వెళ్లదగినంత మాత్రం. ఎదుట లారీగానీ మరే వాహనం గానీ వస్తే ఆగడానికి ఫర్లాంగుకొక కొంచెం వెడల్పైన, ఎదుటి లారీ దాటిపోగల స్థలం. వాహనం గాడి తప్పి ఒక అడుగు పక్కకు వెళ్లినా మంచు నిండిన లోయలో పడి కూరుకుపోవడమే. కనుక వాహనాలు కొండల వరుసల వైపుకు ఆనుకునే నడుస్తాయి. అయినా చక్రాలు జారడం, ప్రమాదాలు జరుగడం విధి విధానం... మా స్టేషన్‌వాగన్ కదలిన అరగంటకు మంచు తుపాను మొదలైంది. చమన్ నుంచి శీలాబాద్‌కు దూరం 30 మైళ్లని జ్ఞాపకం. ఐదారు మైళ్ళు వెళ్లామో లేదో మంచు తుఫాను. పక్కన లోయలలో తొంగి చూస్తే, తెల్లటి మేఘాల దొంతరలు, సైంధవలవణం

పర్వతాలు పడినట్టు మంచుకుప్పలు. అవిగాలికి చూస్తూండగానే ఆరి గడ్డకట్టుకుపోతున్నాయి. ముందొక వాహనం వెళ్లుతూంది. అది కొంచెం గాడి తప్పిందనే అనుమానం కలిగింది మా వాహనం డ్రైవరుకు. కుడివైపు లోయ. సాధ్యమైనంతవరకు ఎడమ వైపునకే వుండమని వైర్‌లెస్‌లో కోరాడు. కాని, దురదృష్టం! ఎడమ వైపున గట్టిపడిన మంచుదిబ్బకు ఆ వాహనం ముందు చక్రం తగిలింది. వాహనం అమాంతం పైకిలేచి లోయలోకి దొర్లింది. డ్రైవరు ఎంతో సహనంతో తన ప్రయత్నంలో వున్నాడు. ఒక్క క్షణం అంతే! మంచులో కూరుకుపోయింది. మంచుదొంతరలు పేరుకుంటూనే వున్నాయి.

మా డ్రైవరు రెండు నిముషాలు వాహనం ఆపాడు, మావైపు చూచాడు. మా జట్టుపెద్ద వెంటనే వైర్‌లెస్‌లో చమన్‌కు ఫిర్యాదు చేశాడు. మాకు ఆదేశమిచ్చాడు. మేము మోకరిల్లి ఆ వాహనంలోని వారి సద్గతుల కోసం ప్రార్థన చేశాము. ప్రయాణం ముగిసేవరకు ఒకరి నోటివెంటా మాటా పలుకూలేదు.

నిండు ప్రాణాలు - రెండు క్షణాల ముందున్న ప్రాణాలు, చూస్తుండగానే, అవశులమై చూస్తుండగానే మృత్యువు వాత పడడం మనస్సును స్తంభింపజేసింది. చమన్‌కు తిరిగి వెళ్లగానే, మాబెటాలియన్ కమాండర్ మమ్ముల్ని ఫాలిన్ అని అటెన్‌షన్‌లో నిలబెట్టాడు. ఏం చేశారు, మీ కర్తవ్యం, ఆ ఆపదలో?- అనడిగాడు. జరిగింది చెప్పాడు మా జట్టు పెద్ద. ఆయన ఆదేశంపై మరొక మారు ప్రార్థన చేశాము. నాకు ఆశ్చర్యం కలిగించిందేమిటంటే ఆ మరణోన్ముఖులు, ఒక కేకవేయలేదు, ఆర్తనాదాలు చేయలేదు. భయపడలేదు. నిశ్చింతగా మృత్యువును కౌగలించుకున్నారు. వారి మనస్సు భగవంతునిలో లగ్నమయిందే తప్ప మిారేమిా కాదు. ఆ జట్టు పెద్దా వైర్‌లెస్‌లో రిపోర్ట్ చేసే వుంటాడు.

కాని ఫలితమేముంటుంది?

నేనొక గుడారంలో వుండేవాడిని. అదొక బంగ్లాలాగా వుండేది. నా పక్క వాటాలో (గదిలో) షామహమ్మద్ అనే వ్యక్తి, ఎదుట ఫతేసింగ్ అనే రాజపుత్రుడూ వుండేవారు. షా మహమ్మద్ సూఫీభక్తుడు. మా ఇద్దరికీ మేలు చేయమని అల్లాను నమాజులో కోరేవాడు. ఫతేసింగ్ 20 ఔన్సుల విస్కీ బాటిల్‌ను ఎత్తి గటగట తాగి- తత్త్వశాస్త్ర చర్చ చేసేవాడు. మానవసేవకు

మిలటరీ సర్వీస్‌కంటే మేలైనది మరొకటి లేదని అతడు రకరకాల హేతువులతో నిరూపించేవాడు ఆ కైపులో. నిజం కూడ అంతేనేమో! కులం, మతం, రంగు, దేశం అనే భేదం లేంది అదీ, హరేకృష్ణ - రెండే కనిపిస్తున్నాయి నాకు. మానవత్వపు మేలిమి మిసిమిని ముద్దలు కట్టిస్తుంది మిలటరీ.

** ** **

కాన్పూర్‌లో డెయిలీ టెలిగ్రాఫ్‌లో చేరాను. రిపోర్టర్ - కమ్ - ప్రూఫ్ రీడర్ - కమ్ - మెస్ మానేజర్ - కమ్- అంతా నేనే. మేనేజింగ్ ఎడిటర్ వెంకటరామన్. ఎడిటర్ త్యాగరాజన్. సంవత్సరం పాటు నాతో ఉండండి. ఆల్‌రౌండర్‌గా చేస్తాను- అనేవారు వెంకటరామన్. వృత్తిపైన అపార గౌరవం కలవారు. రాహుల్ సాంకృత్యాయన్ సభకు రిపోర్టింగ్‌కు వెళ్లాను. అంతా కొత్త. ఏది లీడ్ చేయాలో? ఏది ఫ్లాష్ చేయాలో తెలీదు. నేను వ్రాసిన పది పంక్తులూ మెచ్చుకుంటూనే, దిద్ది, మనకు ఆంగ్లభాషా పాండిత్యం ముఖ్యం కాదు. వక్త ఏం చెప్పాడు, దానిలో సమాజానికి ఉపయోగపడే మంచి ఏమిటి, దానిని పైకి తేవడం ముఖ్యం - అనేవారు వెంకటరామన్. మీకు హిందీ. మరి రెండు భాషలు వచ్చు. సంస్కృతం వుండనే వుంది. చిన్న పదాలతో రిపోర్టు చేయండి. ప్రజలకు - పాఠకులకు డైరెక్టుగా దూరాలి మనసులో. కృత్రిమత వద్దు. సాహిత్య చర్చలకు, పెద్దమాటలు, పెద్దశైలి. వార్తలకు చాలా సరళంగా, సులభంగా, సెకండ్ ఫారం చదివినవాడికీ అర్థమయ్యే భాష వుండాలి. నిజాయితీ, వృత్తి శ్రద్ధ వుంటే భాష దానంతట అదే వస్తుంది. 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి' - అంటే ఇదే. స్వచ్ఛమయిన మనస్సు, సరళమైన ఆలోచన, నిర్దిష్టవక్తవ్యాంశం గల వానికి భాష దానంతట అదే రూపొందుతుంది - అనేవాడు వెంకటరామన్.

** ** **

కాన్పూరులో గంగాశరణ్ శర్మ సనాతన ధర్మ కాలేజీలో ప్రొఫెసర్. ఆయనకు కాన్పూరులో సెంట్రల్ ప్రెస్ అనే ముద్రణాలయం, లక్నోలో ఒక పుస్తకాల దుకాణం వుండేవి. ఆయన ఆరడుగుల బంగారు విగ్రహం. పంచ పంచ. ఉషఃకాలంలోనే లేచి గంగకు వెళ్ళి స్నానం చేసివచ్చి, పూజా పురస్కారాల తర్వాత తమ పనులు చూసుకొనేవారు. అనుష్ఠానం అంతా ఏడు గంటలలోపునే అయిపోయేది.

నన్ను ప్రైవేటు సెక్రటరీగా వుండమన్నారు. ఉన్నాను. ఆయన ఇంట్లోనే ఒక గదిలో నివాసం. వారితో పాటే భోజనం. ఆయనకు ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమాళ్ళు. మీరు మాలాగే- మా యు.పి. వాళ్ళలాగే వున్నారే. ద్రావిడులు రాక్షసుల్లాగా వుంటారు. మనకు శత్రువులు అని మా చరిత్ర పుస్తకాల్లో వుందే. ఏదీ మీ భాష మాట్లాడండి- అని ఆ అమ్మాయిలు పీడించుకు తినేవారు. ఆయన చాలా చిత్తశుద్ధిగల కార్యకర్త. వేదమతం తప్ప మరొకటి నమ్మేవాడు కాడు. దాక్షిణాత్యులు వైదిక మతాన్ని, యజ్ఞయాగాదులను అనాదిగా పరిరక్షిస్తున్నారని ఆయన నమ్మకం. గంగాస్నాన మహిమను గురించి రోజూ చెప్పేవారు నాకు.

ఆయన శ్రీమతికి దక్షిణదేశ యాత్ర కావాలి. ఇంకేం? హమారె రామచంద్రజీ వున్నారు. రామేశ్వర యాత్ర రాజాలాగ చేయిస్తారు - అనేవారు ఆమె. పిల్లలేమో మీవూళ్లు చూడాలి, మీ జనాన్ని చూడాలి. చరిత్రలో వ్రాసినవి తప్పు. పెద్ద వాళ్ళమయిన తర్వాత దిద్దేద్దాం - అనేవాళ్ళు. ప్రతివారిలోను ఆర్జవం మీగడ తరకల్లాగ వుండేది. గంగాశరణ్ శర్మతో పని చేయడం ఎంత హాయి! ఇంతదూరం వచ్చారు. పని బాగా నేర్చుకో. నా వద్ద పని చేస్తే ప్రపంచంలో ఏ పనైనా నేర్చుకోవచ్చు. ప్రయివేటుగా చదివి బియ్యే పూర్తి చేయి, కామర్స్ తీసుకో. నేను చెబుతాను- అనేవారు. తన ఉపాధ్యాయ వృత్తిపైన, ముద్రణ కార్యంపైన అపారమైన ప్రీతి ఆయనకు. ముద్రణలో ఒక్క తప్పు దొర్లినా గింజుకొనేవారు. గ్రాహకులకు ఎంతో వినయంతో నచ్చజెప్పేవారు. ఇక కాలేజీలో పాఠం సంగతా, ముప్ఫై ఏళ్లుగా పాఠం చెప్పినా, దినమూ ఎప్పటికప్పుడు ప్రిపరేషన్ కావలసిందే. ఇంత శ్రమ ఎందుకండీ?- అనడిగాను ఒకమారు. విద్యార్థులు చాలా తెలివిగలవారు. ఎప్పటికప్పుడు ఏవో ప్రశ్నలు వేస్తుంటారు. మొదట్లోనే మనమే ఊహించుకుంటే నిరుషహోగానా- అనేవారు.

** ** **

యుద్ధం ముగియవచ్చింది. హైదరాబాదుకు వచ్చాను. `తెలంగాణా' దినపత్రికలో చేరాను. బుక్కపట్నం రామానుజాచార్యులు సంపాదకులు. తెలంగాణా దక్కన్‌క్రానికలుకు అనుబంధం. నాకు వెంటనే పైవారు విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు. విశ్వనాథ సత్యనారాయణగారంతటివారు. వృత్తిధర్మాన్ని తు.చ. తప్పక పాటించేవారు. ప్రతివార్తా ఒక సమగ్ర రచనగా వుండాల్సిందే. ఇక రామానుజాచార్యులు వకాలతుమాని పత్రికా రచనే పరమధ్యేయంగా

(ఆయన ప్రతిదినం వ్రాస్తున్న హాస్యరచన చార్‌మినార్ గ్యాసిప్) అప్పటి జంటనగరాల మేధావులకు ఆమెత.

నిజాం నవాబు కోడలు నీలాఫర్ బేగంగారు ఏదో సభకు ప్రారంభోత్సవం జరిపారు. ఆ ఉత్సవాన్ని కవర్ చేయమన్నారు నన్ను. నేను వెళ్లాను. అప్పటి పత్రికల భాష గ్రాంథికం గనుక, మంచి ప్రబంధశైలిలో ఉత్సవ వైభవం వర్ణించాను. నిజానికి ఆ ఉత్సవం సభకన్నా నిజాం నవాబు దర్బారుగానే జరిగింది. వక్తల వంగి వంగి సలాములు, స్తోత్ర పాఠాలు, అనుగ్రహ ప్రార్థనలు - ఇలా రిపోర్టు దాదాపు రెండు కాలాలు పత్రికలో అచ్చయింది. నేను ఉదయం చదువుకొని మురిసిపోయాను.

తొమ్మిది గంటలకు పత్రిక కార్యాలయంలో అడుగుపెట్టాను. కార్యాలయం అప్పుడు నాంపల్లిస్టేషన్ రోడ్డులో వుండేది. ఎడిటర్‌గారు పిలుస్తున్నారు - అని కబురు వచ్చింది. వెళ్ళాను. ఎడిటర్ నన్ను కూర్చోమన్న తర్వాత ఏమండీ మనది పత్రికా? ప్రబంధమా? మనం నడిపేది పత్రికండీ. ప్రజలకోసం. వారికి ప్రబంధశైలి తెలియడానికి ఇంకా ఇరవైయేళ్లు కాదు రెండు వందల యేళ్ళు పట్టవచ్చు. ప్రతి విషయానికీ శైలి వుంటుంది. వార్తల శైలి సరళగ్రాంథికం. విషయ నివేదనపరమైన వ్యాసాలశైలి అంతకన్నా కొంచెంపై మెట్టు. శాస్త్రచర్చా వ్యాసాలకు అంతకన్నా పైస్థాయి. సంపాదకీయానికి గంభీరమైన శైలి. చార్‌మినార్ గ్యాసిప్ వంటి దానికి కొన్ని ఛలోక్తులు, కొన్ని విసుర్లు, కొన్ని కొటేషన్లు- ఇలా. మరి మీరు వార్తను ప్రబంధశైలిలో వ్రాస్తే ఎలా? మనదేశంలో అక్షరాస్యత ఎంత? హైదరాబాదు రాష్ట్రంలో అక్షరాస్యత ఎంత? అందులో ఉరుదూ ప్రధానమైన విద్యా ప్రణాళికలో తెలుగు చదువుకున్నవారి నిష్పత్తి ఎంత? ఇవన్నీ ఆలోచించండి. మనం ఏమీ రాని వారి మధ్య వున్నామనే దృష్టితో- మరవకండి- సాధ్యమైనంత సరళ గ్రాంథికంలో వార్తలివ్వాలి. గ్రాంథికమే ఎందుకంటారా? తెలుగుదేశంలో ప్రాంతీయాలు చాలా వున్నాయి. గ్రాంథికమైతే అందరికీ తెలుస్తుంది. వ్యవహారికభాష పత్రికలలో రావడానికి కొంతకాలం పడుతుంది. సరే వెళ్లండి. ప్రతి రిక్షావాడూ మన పత్రిక చదవాలి. ఐదవ క్లాసు చదివిన వాడికి అర్థం కావాలి- అని ఏకధారగా చెప్పారు. ఆయనలో వ్యాపారధోరణికన్నా విజ్ఞాన ప్రచారధోరణే ఎక్కువగా వుండేది.

కొన్ని కారణాల వల్ల తెలంగాణా వదిలి `మీజాన్' పత్రికలో చెరాను. దానికి అడవి బాపిరాజుగారు సంపాదకులు. ఆయన మూర్తీభవించిన సౌజన్యం.

అందరినీ సోదరులుగా చూచేవారు. మధ్యాహ్నం ఫలహారానికి ఆవరణలోని వేపచెట్టు కింద కూర్చునే వాళ్లం. ఇళ్ళ నుంచి తెచ్చిన వస్తువులను పంచుకొనేవాళ్లం. బాపిరాజుగారు ఏకంగా ఒక పెద్ద టిఫిన్ క్యారీయర్ నిండా ఫలహారాలు తెచ్చేవారు. ఇన్ని ఎందుకండీ? అనేవారు ఎవరన్నా. అందరికీ కావొద్దటోయ్! - అనేవారు ఆయన.

'మీజాన్' యజమాని ఘులాం మహమ్మద్ కలకత్తావాలా. ఖాన్ బహదూర్ అహమద్ నవాజ్ జంగ్ అల్లుడు. మీజాన్ తెలుగు, ఉరుదూ, ఇంగ్లీషు భాషలలో వెలువడేది. మూడు పత్రికల విధానాలు మూడు విధాలు. తెలుగు పూర్తిగా జాతీయ పత్రిక. స్థానికంగా ఆంధ్ర మహాసభను సమర్థించేది. ఉరుదూ లీగ్‌ను. ఇంగ్లీషుది తటస్థం.

మీజాన్ తెలుగు దినపత్రికకు జనం తండోపతండాలుగా వచ్చేవారు. వార్తలు వేయమని. సర్కారుకు పంపండని రాయబారాలు వచ్చేవి. బాపిరాజుగారు వారిని సమాధానపరిచి, వార్తలు ప్రభుత్వానికి పంపుతామని నచ్చజెప్పి పంపేవారు. మీజాన్ కార్మిక కర్షకులకు మధ్య తరగతి ఉద్యోగులకు పెద్ద అండగా వుండేది. బాపిరాజుగారి ఆర్జవం, వృత్తిపట్ల చిత్తశుద్ధి ప్రజల్లో ఆయనకు ఎంతో అభిమానం కలిగించాయి.

ఒకసారి శివశంకర స్వామి మీజాన్ కార్యాలయానికి వచ్చారు మీ స్టాఫులో మహాకోపిష్టులు, కమ్యూనిస్టులు, ఎస్కేపిస్టులు ఉన్నారోయ్ బాపిబావా!- అన్నారు. ఇలాటివారు నీకు నష్టం- అని ఆయన సలహాయిచ్చారు. బాపిరాజుగారు గొప్ప సమాధానం చెప్పారు. అది ఏ వృత్తివారికయినా కలకాలం అన్వయిస్తుంది. "వీణ చూచారూ- సప్తస్వరాలూ పలుకుతుంది. నాకు పంచమమే కావాలంటే కుదరదు. ఇంద్రధనుస్సులో ఏడురంగులూ వుంటాయి. నా కళ్లకు ఎరుపుపడదు. అంతా పచ్చగానే వుండాలి అంటే కుదురుతుందా? నా సంపాదకవర్గంలోని ఒక్కరొకరూ ఒక్కొక్క స్వరం. ఒక్కొక్కరంగు. అన్నీ అవసరం. అన్నీ వాడుకోవాలి. వాడుకుంటాము-" అన్నారు.

ఆంధ్ర మహాసభ కార్యకర్తలు వార్తలకని, ప్రకటనలకని, వ్యాపార ప్రకటనలకని తరచు వచ్చేవారు, గుంపు కట్టుకొని. అలాటివారిలో ఒకరు ఆవుల పిచ్చయ్య. అతనిలో రచనాశక్తి నివురు గప్పిన నిప్పులాగా వున్నదని ఎవరికీ తెలియదు. ఒకరోజు నేను నా చెత్తబుట్టను యథాలాపంగా చూచాను.

దానిలో కొన్ని కాయితాలు, విడివి, పిన్నుగుచ్చిన బొత్తులూ పడి వున్నాయి. రాత్రి పని చేసిన వారు వాటిని దానిలో పడేసి వుంటారు. నేను యథాలాపంగా ఒకటిపైకి తీశాను. చప్రాసీ ఆత్మకథ అని శీర్షిక వుంది. కుతూహలం కొద్దీ గబగబా చదివాను. చాలా బాగుంది. నిజాం ప్రభుత్వంలోని చప్రాసీల అగచాట్లను కథగా చెప్పాడు రచయిత. అటువంటి మంచిరచన - ముడి బంగారు - చెత్తబుట్టలో ఎలాపడిందా అని కోపంతో కేకలు వేశాను. అప్పుడే కార్యాలయంలో అడుగుపెడుతున్న బాపిరాజుగారు ఏమిటి? ఏమిటి? ఉదయం ఉద్రేకంతో ప్రారంభమయిందే. ఇక మధ్యాహ్నం మండిపోతుంది- అంటూ దగ్గరికి వచ్చారు. "చూడండి సార్. ఆవుల పిచ్చయ్య ఎంత చక్కని స్క్రిప్టు వ్రాశాడో! చెత్తబుట్టలో పడింది. నేను చూడకపోతే పెంటకుప్పకు వెళ్లిపోయేదిగా" - అన్నాను కోపం తగ్గించుకుని. ఆయన తమసీటులో కూర్చుని, తక్కిన పనులన్నీ మాని - కార్యాలయం తెరవగానే ఎన్ని అత్యవసరమయిన పనులుంటాయో పత్రికలవారికి తెలుసు. ఏవి మిగిలిన వార్తలు, వేటిని కిల్ చెయ్యాలి, విస్తరింపవలసినవి ఏమిటి? ఏ పుటలో ఏది పోవాలి, అడ్వర్టైజ్‌మెంట్ ఎంత, పేపరు డిమాండ్ ఎంత, వ్యాసాలు కావాలా- ఇలా ఎన్నో విషయాలు వుంటాయి- చదివారు. ఆయన కూడా థ్రిల్ అయ్యారు. "ఇతడు మంచి రచయిత కాగలడు. భాషలో మార్పువద్దు. పంక్చుయేషన్స్ చూడండి. ఈవేళ శనివారంగా. రేపటి మేగజీన్ సెక్షన్‌లో వేద్దాం"- అన్నారు. అదీ వృత్తిప్రేమ. వృత్తి గౌరవం.

** ** **

ఒక విధంగా వృత్తిధర్మం వేరు, వృత్తి గౌరవం వేరు కాదు. వృత్తి ధర్మమే బలపడితే వృత్తి గౌరవంగా మారుతుంది. వృత్తిపై గౌరవం వుంటే అది ధర్మంగా విరాజిల్లుతుంది. రెండూ అన్యోన్యాశ్రయాలే తరచి చూడగా. ఏదో వచ్చాము. మరే సర్కారు నౌకరీ దొరక్క ఇక్కడ చేరాము. మొక్కుబడిగా పనిచేద్దాము... అనే మనస్తత్త్వం క్రమంగా ధర్మంగా మారవచ్చు. కొంచెం వివేకంకల వ్యక్తి, పాలికి వచ్చింది పరమాన్నం అని అనుకొని కొంత శ్రద్ధ చూపితే, అది ధర్మంగా మారుతుంది. వృత్తి ధర్మం ఆవలిమెట్టు వృత్తిగౌరవం. గౌరవం అంటే, ఏదో మంచిపనే. ఫరవాలేదు. జీవితం గడుపుదాం. ఇంతకన్నా మంచి వుద్యోగం వచ్చి చచ్చిందా? వస్తే చూద్దాం- అనే భావం కాదు. గౌరవమంటే పూర్తిగా దానిపై బరువు, తాదాత్మ్యం, వైష్ణవ పరిభాషలో భరన్యాసం.

ప్రతి వ్యక్తికీ ఒక ధర్మం వుంటుంది. ముఖ్యంగా వృత్తిధర్మం. నా మిలటరీ మిత్రుడు, ఉరుదూ కవి ఆఫ్తాబ్ అహ్మద్ అనేవాడు 'రామచంద్రజీ. మీ ధర్మం ఇది కాదు, లిఖ్‌నా పఢ్‌నా ఔర్ ఉపదేశ్ కర్‌నా; ఇక్కడ మీరూ, నేను ఏం చేస్తాం?' ఆ మాటలు విని మరి అంత గొప్ప రచయితలు, వాఖ్యాతలూ అవుతామా? అనేవాణ్ని. గొప్పవాళ్ళం కాకపోవచ్చు. ధర్మం నిర్వర్తించిన వాళ్లమవుతాము. దానిపై మనకు గౌరవం వుంది. జీవితం సుఖంగాను, సార్థకంగాను అవుతుంది - అనేవాడు. సుఖమంటే?- అనడిగాను. సుఖమంటే మన ధర్మం నిర్వహించిన సంతృప్తి, మనం గౌరవించే వృత్తిలో వున్నామన్నా నమ్మకం అల్లా ఎదురుపడి అడిగినా, జవాబు చెప్పగల

ం - అనేవాడు ఆఫ్తాబ్.

*

# శ్రీవల్లభ చరితామృతం

హిందీమూలం : శ్రీకళాధరభట్

తెలుగు : డా. శ్రీ తిరుమల రామచంద్ర

## పుష్టిమార్గం వైదికమార్గం కన్నా భిన్నం

ధర్మం, జ్ఞానం వేదం యొక్క రెండు స్వరూపాలు. పూర్వమీమాంసలో ధర్మ నిరూపణ, ఉత్తర మీమాంసలో జ్ఞాన నిరూపణం జరిగాయి. ఈ రెండింటి సమన్వయమూ వైదిక ధర్మమార్గమనే పేరుతో సుప్రసిద్ధమైంది. వల్లభాచార్యులవారు ప్రోద్భావితమైన పుష్టిమార్గాన్ని వైదిక మార్గంకన్నా ప్రకృష్టమైందిగా తెలుపుతున్నారు. ``లౌకిక వైదిక మార్గాపేక్షయా పుష్టిమార్గ ఉత్కృష్టః" - సుబో. లోకమూ వేదమూ నిర్దేశించిన బంధనాల నుంచి పుష్టిమార్గం స్వతంత్రమైనది. అందువల్ల వల్లభాచార్యుల వారు తమ భక్తి సంప్రదాయాన్ని ``స్వతంత్ర భక్తిమార్గం" అని అన్నారు. స్నేహంలో విధి నిషేధాలు నియామకాలు కావు. ఇది ఒక మనస్తత్వ శాస్త్రసత్యం - 'విధిస్నేహయోః స్నేహో వరిష్ఠః-' సుబో. వైదికధర్మం విధి నిషేధాత్మకం, కృతిసాధ్యమూను (చోదనాలక్షణోధర్మః). కాని భగవంతుడు అవికృతుడు (వికారం చెందనివాడు), అవ్యయుడు కావడం వల్ల ఎన్నిటికిని కృతిసాధ్యుడు కాడు, అప్రమేయుడు కావడం వల్ల జ్ఞాన సాధ్యుడును కాడు, నిర్గుణుడు కావడం వల్ల దేహగుణాలైన `భజనా'దులతో సాధ్యుడు కాడు. ఎందుకనగా గుణాలు ఉన్నప్పుడే వాటికి సంబంధించిన విషయాల ప్రతీతి, గ్రహణమూ కలుగుతున్నవి..ఆకలి కలిగినప్పుడు అన్న ప్రతీతి గ్రహణాలు, కామావేశం కలిగినప్పుడు కామినీ ప్రతీతి గ్రహణాలు, ఇంద్రియాల అస్తిత్వం వల్ల వాటి విషయాల ప్రతీతి గ్రహణాలు కలిగినట్లు. అందువల్లనే భాగవతంలో భగవానుడు స్వయంగా ``నేను స్నేహంతోనే సాధ్యుణ్ణి. కృతితో కాదు" ``స్నేహ ఏవమయి నతు కృతిః" అని అన్నారు-సుబో. ఎందుకంటే నాతో సంబంధించిన సమస్త జీవసమూహమూ స్వయంగా సహజంగానే ప్రీతిమయతను పొందుతుంది. ``మమ సంబంధిన స్సర్వ ఏవజన్తవః స్వయమేవ ప్రీతా భవంతి"-సుబో. అందువలన పుష్టిమార్గంలో విధి నిషేధాత్మకమైన కర్మమార్గమూ,

అట్లే పూర్వసిద్ధాలైన జ్ఞాన భక్తులు ఎంత మాత్రమూ ఉపయోగపడవు. `పూర్వ సిద్ధజ్ఞాన భక్త్యోః నాత్రోపయోగః"-సుబో.

సంక్షేపతః వైదిక ధర్మమూ, పుష్టిమార్గమూ భిన్నమైనవి. వైదిక సృష్టి, పుష్టితుష్టి కూడా భిన్నభిన్నమైనవి. ఈ విధంగానే ఇతర భక్తిమార్గాలకంటే కూడ భక్తిమార్గం విభిన్నమైంది. జ్ఞానమార్గం భ్రాంతికి మూలం-`జ్ఞానమార్గో భ్రాంతి మూలః'. ధర్మం విధ్యాత్మకం - భక్తి సాధనాత్మకం. ఆత్మజ్ఞానంతో మనశ్శాంతి ప్రాప్తించడం నిజమే - కాని పరమానందం లభించదు. `ఆత్మజ్ఞానేపిశాంతతా పరం న పరమానందః'-సుబో. ధర్మం వల్ల స్వర్గాది సుఖాలు తప్పక లభిస్తాయి కాని, అవి అంతవంతమైనవి- క్షీణించేవని చెప్పబడ్డాయి. (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) పుష్టిభక్తి జ్ఞానం కన్నా, కర్మకన్నా, సకల విధ భక్తిమార్గాలకన్నా, జ్ఞానభక్తి కన్నా కూడా ప్రకృష్టతమమైంది - ఎందుకంటే, పుష్టిమార్గంలో సకల పురుషార్థదాయకుడైన భగవానుడే స్వయంగా పురుషార్థరూపంలో లభ్యమానుడవుతున్నాడు. `నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికా సుతః, జ్ఞానినా మాత్మభూతానాం యథాభక్తి మతామిహాం" - శుకదేవుడు.

వల్లభాచార్యులవారు వైదిక మార్గంలో లాగ పుష్టిమార్గపు అధికార యోగ్యతానుసారం ప్రాణులను పుష్టిజీవ, మర్యాదజీవ, ప్రవాహి జీవులని మూడు వర్గాలుగా విభజించారు.

భగవచ్చరణ రజో మయ దేహం కలిగి, భగవదంగీ కృతులైన జీవులు పుష్టిజీవులు. వీరి సంపూర్ణ కర్మలు భగవత్కర్మలు అవుతున్నాయి. వీరికి పుష్టి - అనగా భగవదనుగ్రహ రూపమైన ఫలం ప్రాప్తమౌతుంది. మర్యాదా జీవులు దేవతలు. వారి దేహం వేద విహిత సంస్కారయుతం గనుక పవిత్రమైంది. వారి కర్మలు (పనులు) వేదాచారానుకూలంగా ఉంటాయి. వారికి జ్ఞానం ద్వారాకాని, ధర్మం ద్వారాగాని అక్షర బ్రహ్మం లేక స్వర్గాది సుఖ రూపఫలం లభిస్తుంది. సంసారంలో పరమాసక్తులు, సంస్కార రహితులు, లౌకిక ప్రవృత్తిపంకంలో నిరంతరం కూరుకుపోయినవారు ప్రవాహిజీవులు - వారికి తమ కర్మానుసారం స్వోదర భరణ పోషణాది ఫలాలు లభిస్తూంటాయి.

జీవులలో ఉండే ఈ తారతమ్యానికి కారణం వారి ఉత్పత్తి ప్రకారంలోని

భిన్నత్వమేనని వల్లభాచార్యుల వారి మతం. సచ్చిదానందమయమైన పరబ్రహ్మ మనస్సునుంచి ప్రవాహిజీవులు, పరబ్రహ్మ వాణి నుంచి మర్యాదజీవులు, పరబ్రహ్మ దివ్య శరీరము నుంచి పుష్టిజీవులు ఉద్భవించినట్లు భావిస్తారు. తదనుసారంగా ప్రవాహిజీవులు సదంశ ప్రధానులు, మర్యాదాజీవులు చిదంశ ప్రధానులు, పుష్టిజీవులు ఆనందాంశ ప్రధానులు అవుతున్నారు. ఏ తత్పరిణామంగా పుష్టిజీవులు తమ దేహంతోను, కర్మలతోను, ఉత్పత్తి ప్రకారంతోను ప్రవాహి, మర్యాదా జీవులకన్నా సర్వధాభిన్నులుగా ఉన్నారు. "తస్మాజ్జీవాః పుష్టిమార్గే భిన్నా ఏవ న సంశయః" -వల్లభాచార్యుల వారు.

పుష్టిజీవులలో శుద్ధ పుష్టిజీవులు సాక్షాద్భగవంతునితో లీలా విలాసాలు జరుపుతారు. వారి దేహం లీలోపయోగిగా ఉండడం వల్ల అవికృతమూ, నిత్యమూ, ఆనందమయమూనని భావించబడుతున్నది. భజనోపయోగమైన కుటుంబంలో వారు ఆవిర్భవిస్తారు. వారి దేహం ధ్వజకమల వజ్ర అంకుశ శ్రీవత్సాది భగవచ్చిహ్నాలతో భాసిస్తూ ఉంటుంది. వారు భగవంతునితో సమానమైన వయస్సు కలవారుగాను, భగవత్సమానమైన సౌందర్యోద్బోధక గుణాలుకలవారుగాను ఉంటారు. భగవానుని కేవలానందమయ కరపాద ముఖోదరాద్య వయవాల నుంచి సంభూతులైన ఈ శుద్ధ పుష్టిజీవులు భగవంతుని వలె అతిరోహితానంద రూపులు (శాశ్వతానంద రూపులు)గా భావించబడు తున్నారు. ``ఏకో హం బహుస్యామ్', `స ఏ కాకీ నరమతే సద్వితీయమైచ్ఛత్ పతిశ్చ పత్నిశ్చాభవత్" అనగా, నేను ఒంటరిని, అనేకులుగా కావాలని కోరుతున్నాను. అతడు ఒంటరిగా క్రీడింపజాలడు. అతడు రెండవ వారిని వాంఛించాడు. అతడే పతిగా పత్నిగా ఇరువురయ్యాడు అనే శ్రుతి వాక్యాలలో ఈ పుష్టి జీవులను సూచించడం జరిగింది. పుష్టిజీవుల సృష్టి కేవలం లీలార్థమే జరిగింది.

పుష్టిజీవుడు ముక్తుడు, శుద్ధుడు, లీలాసృష్టిగతుడును అయి ఉన్నాడు. మొదట భగవంతుని సామాన్య కృపతో కృతార్థుడై పిదప క్రమంగా విశేషానుగ్రహయుక్తుడైన పుష్టిజీవుణ్ని `మిశ్ర' పుష్టిజీవుడని వ్యవహరిస్తారు. ఈ జీవులు నారద ప్రహ్లాదాదులవలె సర్వజ్ఞత్వాది గుణాలు కలవారై ఉంటారు. పుష్టిమార్గంలో ఉన్న ప్రవాహిజీవులు ఏదో విధంగా భగవద్ధర్మంలో ఉంటూ తీర్థాటనం చేస్తుంటారు. ఈ జీవులే మర్యాదాయుతులైనప్పుడు భగవద్గుణ జ్ఞానయుతులుగా భావింపబడినారు. స్నేహ సంయుక్తులయిన పుష్టిజీవులు ప్రేమాతిరిక్తమయిన సకల ప్రకారస్ఫూర్తి శూన్యులు కావడం వల్ల పరమ

దుర్లభులుగా ఉంటారు. శుద్ధ పుష్టిజీవునికి భగవంతుడు ఆనందమయ రూపంలో సాక్షాత్కరించి ఫలం అనుగ్రహిస్తాడు. ఐశ్వర్యాది షడ్గుణోపేతుడైన భగవంతుడు ఏ భక్తుని హృదయంలో ఏ భావం ఉంటుందో ఆ భావోపాత్తరూపంలో అతని హృదయంలోగాని, అతని సేవ్య స్వరూపంలోగాని, అతని ఇంట్లోగాని ఆవిర్భవిస్తాడు. పుష్టిజీవునికి అప్పుడప్పుడు అహంకారం ఏర్పడం వల్ల, అంటే సౌభాగ్యమదం కలగడం వల్ల భగవంతుడు అతనికి శాపం కూడా ఇప్పిస్తాడు. కాని, చివరకు అతనికి క్షతికాకుండా చూస్తాడు `చౌరాసీ' (84), `దోసాబావన్' (252) తెగల వైష్ణవులు ప్రాయశః ఇలాటి జీవులే కావచ్చును. వీరు మళ్ళీ వల్లభాచార్యుల, వారి పుత్రులైన ప్రభుచరణుల సేవకులై `పుష్టి' యోగ్యతను పొందినారు. వీరికి భగవంతునిపైనే ఏకాంత నిష్ఠ వుండడం వల్ల లౌకికత్వం కృత్రిమం. ఈ విధంగా వల్లభాచార్యులవారి మతంలో `పుష్టి మార్గానికి ఒక విశిష్టత ఉంది. ఈ కారణం వల్ల ఈ మార్గం అన్య సంప్రదాయాలకన్నా సర్వథా భిన్నమైనది. `ప్రమాణ భేదాత్ భిన్నోహి పుష్టిమార్గో నిరూపితః'-వల్లభాచార్యులవారు.

దార్శనిక పక్ష, ఆచార పక్షాల ఏకత్వం-

వల్లభాచార్యులవారు ఉపదేశించిన పుష్టిమార్గాన్ని ఉన్నదున్నట్లుగా తెలుసుకొనడానికి వారి దార్శనిక సిద్ధాంతపు, వారి భక్తితత్త్వపు నిగూఢ నిరూపణ వివరణను, ముందు పేర్కొన్న వారి విలక్షణ పుష్టి ప్రవాహ మర్యాదా' నిర్వచనం వివరణను హృద్గతం చేసుకోవడం పరమావశ్యకం. ఎందుకంటే, వల్లభాచార్యుల సంప్రదాయంలో దార్శనిక పక్షమూ, ఆచార పక్షమూ పరస్పరం అభేద రూపంలో ఉండడమనేది అశ్రుత పూర్వమైన పరమ ఆదర్శమయత. ఈ సంప్రదాయపు క్రియాత్మక- ఆచారాత్మక స్వరూపం సేవాభావ పూర్ణుడైన ప్రతి వల్లభవైష్ణవుని నైతిక జీవితంలో యథాతథంగా కనిపిస్తుంది. అందువల్ల సిద్ధాంతపక్షపు యథార్థ పరిజ్ఞానం వల్లనే ఈ సంప్రదాయపు ఆచార పక్షం, బ్రహ్మ సంబంధ విధి, సంప్రదాయపు ప్రథమ ప్రవర్తకా చార్యుల, వారి వంశీయులైన ఆచార్యుల స్వరూపం, మాహాత్మ్యం, ఈ సంప్రదాయంలో వారి పరమ పూజ్యత, వారు ఆరాధించిన ఆరాధ్యమైన స్వరూపం, వారి సేవా పద్ధతి, గురుశిష్యుల సేవ్య ప్రతిమా స్వరూపం, గురుశిష్యుల పరస్పర సంబంధం, దేవాలయ పద్ధతి, సంప్రదాయపర, ఆచార వ్యవహారాలు, రీతిరివాజులు - వీటి చిత్ర సహజంగా స్పష్టం కావచ్చు.

(ఇంకా ఉంది)

# దివ్యయోగి చరితామృతము - శ్రీధర వెంకటేశ అయ్యావాళ్

**(1635-1720)**

- ఆచార్య శ్రీబి. రామరాజు

భగవత్సంకీర్తన మనే నామసిద్ధాంతానికి కావేరి అంతర్వేది భక్తయోగు లైదుగురు ప్రవర్తకులు. వారు శ్రీ ధర వెంకటేశ అయ్యావాళ్, కాంచీకామకోటి పీఠం 59వ జగద్గురువులు (1638-1692) బోధేంద్ర సరస్వతి, సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి, నారాయణ తీర్థులు, సద్గురు స్వామి. ఇందులో కాంచీ జగద్గురువులు తప్ప మిగతా నల్గురు ఆంధ్రులు కావటం ఆంధ్రజాతికి గర్వకారణం. ఈ యోగిపంచకంలో మొదటి ముగ్గురు సమకాలీనులు. వీరికి నూరేండ్ల తరువాత ఉన్నవారు సద్గురుస్వామి (1776-1817), అసలు పేరు వెంకటరామదేశికులు. ఆయన భారతదేశంలోని సమస్త దివ్యతీర్థాలు దర్శించి ఉంఛవృత్తి స్వీకరించి, తాళ్ళపాకలో నామసంకీర్తన పద్ధతిని గమనించి, బోధేంద్రుల జీవసమాధి కనుగొని, మరుద నల్లూరులో కొంతకాలం ఉండి, తంజావూరు రాజుచే తిరువిశనల్లూరు సమీపాన భాగవతపురం అగ్రహారం పొంది అక్కడే స్థిర పడ్డారు. ఆనాడు సద్గురు స్వాములవారు రూపొందించిన నామ సంకీర్తన పద్ధతి ఈనాటికీ జరుగుతున్నది. పూర్వపు నామోచ్చారణ పద్ధతికి భావరాగముల మేళవింపుతో సద్గురుస్వామి క్రొత్తమలుపు నిచ్చినారు.

శ్రీ ధర వెంకటేశులు, సదాశివబ్రహ్మేంద్రులకు సహాధ్యాయి, గురువు అనటంచేత సమకాలీనుడుగా భావించి ఆయన కాలం 1635-1720 గా ఊహించటం జరిగింది. తంజావూరు రాజ్యం ఏలిన (1684-1712) శాహజీ మహారాజు కావేరీతీరానగల తిరువిశనల్లూరనే గ్రామాన్ని శాహరాజపురంగా పేరు మార్చి 1693లో అక్కడి 46మంది పండితులకు దానం చేసినాడు. ఈ 46మంది దాన ప్రతిగ్రహీతల్లో శ్రీ ధరవెంకటేశులొకరని ప్రొ.వి. రాఘవన్‌గారి అభిప్రాయం. వెంకటేశుడు వెలనాటివైదికి, కౌశిక గోత్రుడు, శ్రీధర లింగార్యుని కొడుకు. శ్రీ ధర వెంకటేశుడు, రామభద్రదీక్షితులు, గోపాలకృష్ణశాస్త్రి, సదాశివ బ్రహ్మేంద్రులు తిరివిశనల్లూరు గురుకులంలో సహాధ్యాయులు. వెంకటేశుని కొడుకు నవీనపతంజలి శ్రీధరపేరుభట్టు వసుమంగళ నాటక నిర్మాత. శ్రీ

శ్రీధరవెంకటేశుడు మహాపండితుడు, గొప్ప శివభక్తుడు, గృహస్థరాజయోగి. మధ్యార్జునం నామాంతరంగల తిరువిడమరుదూరులోని మహాలింగస్వామి ఆయన ఇష్టదైవతం. శివకేశవ భేదరహితమైన పరాభక్తి, శమాది షట్కసంపత్తి, సర్వభూతదయగల ఈ మహితాత్ముణ్ణి సమకాలీనులు అయ్యావాళ్ అని పిలుస్తూ కొలిచేవారు. ఆయన యెడ ఈగౌరవం కావేరి తీరవాసులకు ఇప్పటికీ ఉన్నది. అరవదేశంలో భజనకూటాల్లో అయ్యావాళ్ పేరుతో పాటలు పాడి ఆయనను మొదట స్మరిస్తారు. అయ్యావాళ్, బోధేంద్రులు ఇద్దరూ భజన సంప్రదాయానికి ఆద్యప్రవర్తకులు. బోధేంద్రులు తమ గురువు ఆత్మబోధుల అనుమతితో రామేశ్వరం నుండి తిరిగివస్తూ తిరువిశనల్లూరులో అయ్యావాళ్‌ను కలుసుకొని ఆయన రచించిన ఆఖ్యాషష్టి పరిశీలించి తమ ఇరువురి అభిప్రాయాలు ఒకటే ఐనందుకు సంతోషించి అభినందించినారు.

శ్రీ ధర వెంకటేశులు గొప్పపండితకవి. ఆయన సంస్కృతంలో అనేక గ్రంథాలు వ్రాసినారు. తనకు భక్తుడూ పోషకుడూ ఐన శాహజీ మహారాజు చరిత్రం శాహేంద్రవిలాసం పేరుతో ఎనిమిది సర్గల మహాకావ్యం రచించినారు. ఆరాజు ప్రార్థన మన్నించి నల్లాధ్వరి, సనాముడైన వెంకటేశ్వరశాస్త్రి అనే ఇరువురు పండితులతో కలిసి "పదమణిమంజరీ"అనే శబ్దకోశం కూర్చినాడు. ఈ రెండు మాత్రమే ఆయన లౌకికకృతులు. మిగతా ఆఖ్యాషష్టి, దయాశతకం, ఆర్తిహరస్తోత్రం, కుళీరాష్టకం, అచ్యుతశతకం, శివభక్తలక్షణం, శివభక్తి కల్పలతికా, మాతృభూతాష్టకం, తారావళీస్తుతి, స్తుతిపద్ధతి, డోలానవరత్నమాల, దోషపరిహారాష్టకం, భగవన్నామభూషణం ప్రభృతి కృతులన్నీ భక్తి వేదాంతమయములు. ఇందులో నామసిద్ధాంతాన్ని ప్రపంచించే "భగవన్నామ భూషణం"ఒక్కటే బృహద్గ్రంథం. ఇందులో శ్రీ ధర వెంకటేశులు నామ సిద్ధాంతాన్ని శ్రుతులు స్మృతులు ఆధారంగా ప్రపంచించినారు. బోధేంద్రులు దీనిని తమ నామామృత రసాయనంలో ఉదాహరించినారు. వెంకటేశుల మిగతా రచనలన్నీ లఘుకృతులు. అవి బహుళజనాదరం పొందిన భక్తిరసనిర్భర కృతులు. ఆఖ్యాషష్టిలోను, దయాశతకంలోను శివనామాన్ని అమ్మవారుగా దర్శించినారు. పార్వతికాక శివునికి మరిరెండు శక్తులున్నవి; ఒకటి ఆయన నామం రెండవది కరుణ. వీణ అయ్యన్న అనే తెలుగు విద్వాంసుడు, పెరియప్పకవి అయ్యవాళ్ అనుగ్రహానికి పాత్రులైనవారు. శిష్యులాయనలో భగవత్కళను దర్శించి కొలిచేవారు.

అయ్యావాళ్ సంసారులైనా వైదిక ఋషులవలె నిరంతరం భగవద్ధ్యాన సమాధిలో ఉండేవారు; సమస్త చరాచరములను ఆత్మవతుగా సంభావించేవారు.

తత్ఫలితంగా ఆయనకు అనేకాద్భుత శక్తులు అలవడినవి. ఆయన పిలిస్తే దేవుడు పలికేవాడు. ఆయన మహిమలకు పాత్రులైనవారు పెక్కుమంది. ఆయన ప్రదర్శించిన అద్భుతాలు భక్తులు తరతరాలుగా చెప్పుకుంటూ రావటంచేత గ్రంథస్థం ఐనవి. శ్రీధరవెంకటేశులు దయాంతఃకరుణులు, తిరువిశనల్లూరులో ఒకప్పుడుఅనావృష్టి సంభవిస్తే రైతులు ఆయనను ప్రార్థించినారు. ఆయన కుళీరాష్టకం స్తోత్రం చేసి వానలు కురిపించినారు. మృత్యువు నోటపడిన శిశువును తారావళీ స్తోత్రం చేసి రక్షించినారు. ఆయన ప్రదర్శించిన పెక్కుమహిమల్లో కొన్ని.

1. తిరువిశనల్లూరు శ్రీ మంతుడొకడు తన ఇంట్లో రాధాకల్యాణోత్సవం జరుపుతూ మరుదనల్లూరు భజనమండలితో పాటు శివభక్తులైన శ్రీధర వెంకటేశులను ఆహ్వానించినాడు. ఉత్సవం ప్రారంభ సమయానికి అయ్యావాళ్ ఒక శిష్యుణ్ణి ఆ శ్రీ మంతునింటికి పంపినారు. అయ్యావాళ్ శివభక్తుడు కనుక ఆయన రాకుండానే శ్రీమంతుడు ఉత్సవం ప్రారంభించినాడు. శిష్యుడు తిరిగివచ్చి గురువుగారికి ఈవిషయం చెప్పినాడు. అయ్యావాళ్ నిరాశపడి చేసేదేమీలేక శిష్యులను తమతమ యిండ్లకు భోజనాలకు పొమ్మన్నారు. కొందరు వెళ్ళి పోయినారు; ఏం జరుగుతుందో చూస్తామని కొందరుండి పోయినారు. ఉత్సవం ఊరేగింపు తమ యింటి ముందుకు రాగానే అయ్యావాళ్ శ్రీ కృష్ణుణ్ణి ఒకశ్లోకంతో స్తుతించి తన పూజాగృహానికి ఆహ్వానించినారు. ఊరేగింపు పటంలోని కృష్ణుని బొమ్మ మాయమై అయ్యావాళ్ పూజాగృహంలో దర్శన మిచ్చింది. చూపరులందరూ సంభ్రమాశ్చర్యాలకు లోనైనారు. శ్రీ మంతుడు అయ్యావాళ్ కాళ్ళపైనబడి క్షమాభిక్ష యాచించినాడు. శ్రీకృష్ణుడు ఊరేగింపు పటంలో ఎప్పటివలె కనపడ్డాడు. ఊరేగింపు సాగిపోయింది. శివకేశవ అభేదపరాభక్తి అయ్యావాళ్ సొమ్ము.

2. అయ్యావాళ్ ప్రతిదినం తిరువిడమరుదూరకు పోయి తన యిష్టదైవతం మహాలింగేశ్వరస్వామిని అర్చించి వచ్చేవారు. తులామాసంలో (అక్టోబరు) ఒకనాడు అతివృష్టి మూలంగా పొంగుతున్న కావేరి దాటలేక ఈవలన ఒడ్డున్నే ఉండి ఆలయం వైపు తిరిగి గుడిగంటలు మ్రోగేదాకా నిలిచి మనసా మహాలింగేశ్వరుణ్ణి కొలిచి అయ్యావాళ్ స్వగృహం చేరినారు. ఉన్నచోటనే ఉండి కొలిచినా ఆయనకు గుడికి పోయివచ్చినంత సంతృప్తి కలిగింది. ఆనాడు మధ్యరాత్రి మహాలింగస్వామి గుడిపూజారి వేషంలో అయ్యావాళ్ ఇంటికి వచ్చి ప్రసాదం అందించినాడు. అంత రాత్రి వచ్చి ప్రసాదం ఇచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపి ఆ రాత్రి తమ యింటనే ఉండిపోవలసిందని

పూజారిని కోరి, అది చలిరాత్రి కనుక తమకు శాహజీ మహారాజు కప్పిన ఆకుపచ్చ జరీ పండిత శాలువా పూజారికి కప్పుకోవటానికిచ్చి, మరునాడుదయం తిరవడమరుదూరుకు కలిసి పోదామని పడుకొమ్మన్నారు. వేకువనే లేచి చూస్తే, పూజారి కనబడలేదు. భార్యనడిగితే తెలియదన్నది. ఇంటివాకిలి తలుపు లోగడియ వేసింది వేసినట్లే ఉన్నది. ఇదెట్లా సాధ్యమా అని అయ్యావాళ్ విస్తుపోయి వెంటనే ప్రాతఃకాల విధులు ముగించి మహాలింగస్వామి గుడిబాట పట్టినారు. తీరాపోతే అక్కడ ఇంకా గుడి తలుపులే తీయలేదు. తలుపులు తెరవటానికి అప్పుడే పూజారి వస్తున్నాడు. రాత్రి తమ యింట పడుకొని చెప్పకుండా ఎందుకు వచ్చినారు? ఎప్పుడువచ్చినా?రని అయ్యావాళ్ పూజారి నడిగితే అతడు అవాక్కైనాడు. తెప్పరిల్లి తాను రాత్రి వారి యింటికి రాలేదన్నాడు. ఇద్దరూ ఆశ్చర్యపోయినారు. పూజారి గుడితలుపులు తెరచినాడు. ఇద్దరూ గర్భగృహం ప్రవేశించినారు. అక్కడ మన శ్రుతిస్మృతులు కూడా అసూయపడవలసిన దృశ్యం కనిపించింది. మహాలింగస్వామి పండిత శాలువా కప్పుకొని దర్శనమిచ్చినాడు. అయ్యావాళ్ కనులవెంట ఆనందబాష్పాలు గంగాయమునలై పారినవి. పరమశివునికి జేజేలు పలికి అయ్యావాళ్ తన యింటికి తిరిగిపోయినారు.

3. అయ్యావాళ్ గొప్ప గృహతాపసి. ఉదయాస్తమయ పూజల తరవాత నిశ్చల ధ్యానమగ్నులై బాహ్య స్పృహ లేకుండా గంటల తరబడి సమాధిస్థులై ఉండేవారు. ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు దినాలు అట్లాగే నిశ్చల సమాధిలో ఉండేవారు. భార్యకాని శిష్యులుగాని ఆయనకు ధ్యానభంగం కలిగించేవారు కాదు. అటువంటి పరిస్థితుల్లో అయ్యావాళ్ గురుకులానికి పోయేవారు కాదు. ఒకసారి మహాలింగస్వామి అయ్యావాళ్ వేషంలో గురుకులానికి పోయి పాఠం చెప్పినారు. ఆనాటి పాఠప్రవచనం తీరుకు విద్యార్థులాశ్చర్యపడినారు. మరునాడు అయ్యావాళ్ ఎప్పటివలె గురుకులానికి వచ్చి రెండు దినాల క్రింద ఆపిన చోటు నుండి పాఠం ప్రారంభించినారు. విద్యార్థులా పాఠం నిన్న చెప్పినారు; కనుక క్రొత్తపాఠం ప్రారంభించండన్నారు. వెంటనే అయ్యావాళ్ ఇది మహాలింగస్వామి మహిమ అని అంతర్దృష్టిలో గమనించి పరమశివుని ముఖతః పాఠం విన్న తమ విద్యార్థుల భాగ్యానికి సంతోషించినారు.

4. ఆకాలంలో బందిపోటు దొంగలు ముందుగానే హెచ్చరించి ఊళ్ళు దోచుకపోయేవారు. పంటలు నూర్పిళ్ళైన తరువాత కళ్ళాలలోని ధాన్యరాసులు ఎత్తుకపోయేవారు. ఇండ్లు చొచ్చి ధనధాన్యాలు దొంగిలించేవారు. ఒక దొంగల ముఠా నాయకుడు తిరువిశనల్లూరు వస్తున్నామని వార్త

భయభ్రాంతులై అయ్యావాళ్‌ను ఆశ్రయించినారు. ఆయన వారినందరినీ తమతోపాటు కావేరీ పులినతలాలపై నామ సంకీర్తన చేయటానికి రమ్మన్నారు. పేదవాళ్ళు, మధ్య తరగతివాళ్ళు స్వామిని వెన్నంటిపోయి భజన చేస్తున్నారు. శ్రీమంతులు తమ మూటలు ముల్లెలు ఆభరణాలు దాచుకోవటంలో నిమగ్నులైనారు. దొంగలు వచ్చి కొల్లగొట్టి తిరిగిపోతూ కావేరీ తీరాన అయ్యావాళ్ చేస్తున్న నామసంకీర్తన విన్నారు. దొంగల నాయకుడు అయ్యావాళ్ భక్తికి ఆకృష్టుడై పల్లకి దిగివచ్చి సాష్టాంగపడి దొంగిలించి తెచ్చిన సొమ్ములో కొంత దక్షిణ సమర్పించిపోయినాడు. అయ్యావాళ్ ఆ సొమ్ముతో మహాలింగస్వామికి నాగాభరణం చేయించి అలంకరించినారు. ఆ నాగాభరణం ఇప్పటికీ ఉన్నది

5. ఒక తులామాసంలో తులాపురాణంలో కావేరి తనను గంగా సమానంగా మన్నించవలసిందని శివుని ప్రార్థించే ఘట్టం అయ్యావాళ్ పురాణం చెప్పుతున్నారు. కావేరికి పోయేత్రోవలో ఉన్న పాత మంటపంలో వారం దినాలు పురాణ ప్రవచనం జరిగింది. చివరినాడెందుకో అయ్యావాళ్‌కు ఆ మంటపం కూలిపోతుందని అంతర్దృష్టికి గోచరించింది. సమాపనోత్సవం ముగియగానే అయ్యావాళ్ తమ శిష్యులతో శ్రోతలతో మంటపం బయటికి నడిచినారు. వాళ్ళు మంటపం వెలుపలకి రాగానే అది దభీలుమని కూలింది. ఎవరికీ అరిష్టం జరుగలేదు. ఇది శివానుగ్రహమనుకున్నారు అయ్యావాళ్, శాహజీ మహారాజుకు ఈ వార్త తెలిసి ఆ స్థలంలోనే క్రొత్త మంటపం కట్టించినారు.

6. అయ్యావాళ్ వద్ద చాలామంది శిష్యులు వివిధ శాస్త్రములు అభ్యసించేవారు. ఒక విద్యార్థి గృహస్థు, నిరుపేద. సంసారం ఈదుకుంటూ చదువుకోవటం అతనికి సాధ్యపడటం లేదు. ఇల్లాలి పోరుకు తట్టుకోలేక చదువుమాని పొరుగూరికి పోయి పొట్టపోసుకుందామనుకున్నాడు. తన దుస్థితి గురువుగారికి నివేదించినాడు. అయ్యావాళ్ అందుకంగీకరించి శిష్యునికి వీడ్కోలు ప్రసాదంగా మూలనున్న ఒక బూడిద గుమ్మడికాయ ఇచ్చినారు. అది పట్టుకొనిపోతే ఆ యిల్లాలు గుమ్మడికాయ ఇచ్చిన గురువునూ, పుచ్చుకున్న శిష్యుణ్ణీ దెప్పిపొడిచింది. దంపతులు ప్రయాణమై పొరుగూరికి పోయి ఒక యింట్లో ప్రవేశించేముందు ఆచారం ప్రకారం ఒక బ్రహ్మచారి చేత ప్రవేశద్వారం వద్ద ఆ బూడిద గుమ్మడికాయను పగులగొట్టించినారు. ఇందుకైనా గురువుగారి గుమ్మడికాయ పనికి వచ్చిం[illegible] వేళాకోళం చేసింది. కాని ముక్కలైన గుమ్మడికాయ నుండి బంగారు కాసులు అంతటా చిల్లి ఆ

దంపతుల కనులు మిరుమిట్లుగొన్నవి. శిష్యుడు వెంటనే పత్నీ సమేతంగా తిరువిశనల్లూరుకు పోయి గురువుగారికి ఈ అద్భుతం విన్నవించినాడు. 'గురువుల' ప్రార్థన మన్నించి భగవంతుడు సామాన్యులను కరుణించి ఈ విధంగా ఆదుకుంటాడనటానికి ఇది నిదర్శనం.

7. తిరువిశనల్లూరు ప్రజలు శ్రీ ధర వెంకటేశ అయ్యావాళ్‌ను పరమేశ్వరావతారంగా భావించేవారు; కొలిచేవారు. కారణం ఆయన ప్రదర్శించిన విభూతులట్టివి. అయ్యావాళ్ ఇంటిబావిలో గంగ ప్రత్యక్షమైన సంఘటన ఇప్పటికీ ఏటేటా ఉత్సవం జరుపుతున్నారు. అయ్యావాళ్ వర్ణాశ్రమ భేదం లేకుండా సర్వమానవుల యెడ ప్రేమాదరాలు వెదజల్లిన మహాత్ముడనీ, మానవత్వపు విలువలు పాటించిన మహితాత్ముడనీ, గొప్ప సంస్కర్త అనీ ఆ సంఘటన చాటుతుంది.

ఒకసారి అయ్యావాళ్ తమ తండ్రి శ్రాద్ధం ఆచరిస్తున్నారు. వంటలైనవి, భోక్తలు వచ్చినారు. అయ్యావాళ్ కావేరీ స్నానానికి వెళ్ళినారు. త్రోవలో ఒక పంచముడు క్షుత్పిపాసా పీడితుడు ప్రాణావసాన స్థితిలో పడి ఉన్నాడు. తాము అధికులమనీ అతడు నీచుడనీ భేదభావం పాటించక ముందుగా తమ కమండలూదకం అతని నోట్లో పోసి దప్పి చల్లార్చినారు. ఇంటికి పరుగెత్తిపోయి సిద్ధంగా వున్న శ్రాద్ధాన్ని తెచ్చి తినిపించినారు. ఆ సంఘటన నాటి సంఘ వ్యవస్థలో ఒక విప్లవం. ఇంటికి వచ్చిన భోక్తలు, పురోహితులు ఆగ్రహోదగ్రులై శ్రాద్ధం విడిచి వెళ్ళిపోయి ఊరి బ్రాహ్మణ్యానికి చాటినారు. అయ్యావాళ్ నిస్సహాయంగా శివుణ్ణి ప్రార్థిస్తున్నారు. సూర్యాస్తమయ సమయానికి ఆ పరమ శివుడే ఇద్దరు పురోహితులను పంపించి శ్రాద్ధ విధులు పూర్తి చేయించినాడు. ఆ యిరువురు పూరోహితులెవరో కాదు; పరమశివుని కుమారులు సాక్షాత్తు వినాయక స్కందులు. ఐనా తిరువిశనల్లూరు బ్రాహ్మణ్యం అయ్యావాళ్ చేసిన అపచారానికి శిక్ష విధించినారు. ఆయన కాశీకి పోయి గంగా స్నానమైనా చేయవలె లేదా ఊరైనా విడిచి పోవలెనని తీర్మానించినారు. అయ్యావాళ్ ఎంత పండితులైనా మహితాత్ముడైనా శ్రాద్ధాన్నం భోక్తలు పురోహితులు తినక ముందే పంచమునికి పెట్టటం శాస్త్రధిక్కారమని, మహాపచారమనీ బ్రాహ్మణుల వాదన. అయ్యావాళ్ తనను ఈ సంకటం నుండి కాపాడుమని గంగాజటాజూటుని ప్రార్థించినారు. ఆయన ప్రార్థన మన్నించి కార్తీక పూర్ణిమనాడు ఇంటిబావిలో ప్రత్యక్షం ఔతానని గంగ స్వప్నంలో చెప్పింది. ఆ సంతోషంతో అయ్యావాళ్‌కు మెలకువ కలిగింది. 'గంగాష్టకం'తో గంగామాతను స్తుతించినారు. తన యింటికి రమ్మని ప్రార్థించినారు. స్వప్నంలో

చెప్పినట్లే కార్తిక పూర్ణిమనాడు అయ్యావాళ్ ఇంటిబావిలో గంగామాత పైకుబికి రావటం ఆనాటి ఆస్తికులు నాస్తికులు సంశయాత్ములు అందరూ దర్శించినారు. అయ్యావాళ్ ఎంతటి మహాపురుషులో గుర్తించినారు. ఇప్పటికీ తిరువిశనల్లూరులో కార్తీకపూర్ణిమనాడు అయ్యావాళ్ భక్తులు గొప్ప ఉత్సవం చేస్తారు. అందరూ ఆ బావినీటితో స్నానం చేస్తారు. భజన కుటాలవారి నామసంకీర్తనంతో పాటు హరికథా కాలక్షేపాలు, గాయకుల భక్తి సంగీతంతో పది దినాల ఉత్సవం వైభవోపేతంగా జరుగుతుంది. వేలసంఖ్యలో భక్తులు ఉత్సవంలో పాల్గొంటారు. అయ్యావాళ్‌ను శ్రద్ధాభక్తులతో స్మరిస్తారు, ఆరాధిస్తారు.

ఈ అద్భుతాలన్నింటికంటే శ్రీ ధర వెంకటేశఅయ్యావాళ్ తమ అవతారం చాలించిన తీరు ఇంకా అద్భుతమైనది. అయ్యావాళ్ చాలాకాలం బ్రతికినారు. ఆయన భార్య ఆయనకంటే ముందేపోయింది. తాము శరీరం చాలించేది అయ్యావాళ్ ముందుగానే భక్తులకూ శిష్యులకూ చెప్పినారు. ఎవరూ వగవకూడదనీ, తమ సందేశం భావితరాలవారికి అందించవలెననీ, భగవన్నామ సంకీర్తనం ఉచ్చనీచభేదం లేకుండా అవ్యాహతంగా, అవిచ్ఛిన్నంగా సాగవలెననీ వారికి హితం బోధించినారు. ఒకనాడు ఎప్పటివలె పూజా విధులు ముగించి కావేరి దాటి తమ ·యిష్టదైవతం మహాలింగేశ్వరస్వామిని అర్చింటానికి తిరువడమరుదూరుకు వెళ్ళినారు. గర్భాలయం చొచ్చి అదృశ్యులైనారు. శ్రీ రంగనాథునిలో ఆండాళు తల్లివలె చిదంబరేశ్వరునిలో మాణిక్యావాచకర్ వలె `అయ్యావాళ్' పరమశివునిలో ఐక్యమై పోయినారు.

*ఆధారం:* 1.ప్రొఫెసర్ వి. రాఘవన్ విజ్ఞాన సర్వస్వము III - 1951
2. ఆర్. కృష్ణమూర్తి The Saints of the Cauvery Delta 1979.

---

"నామ రూపాత్మకమైన ఈ ప్రపంచంలో కర్మలు ఆచరించేవారూ ఆచరించిన కర్మలకు ఫలితం అనుభవించేవారూ ఎందరో ఉన్నారు. వాళ్ళు చేసే పనులకు దేశ కాలకర్మలను బట్టి ఫలితం ఇక్కడే లభిస్తుంది. విశ్వరచనా స్వరూపం మనస్సు వల్ల కనుక్కోవటానికి వీలులేదు. ఈ సృష్టి స్థితిలయాలకు హేతువైన మూల కారణం ఒకటుంది. అది సర్వజ్ఞం. సర్వశక్తి సమన్వితం. దానినే బ్రహ్మము అంటారు. అని బ్రహ్మసూత్ర భాష్యంలో చెప్పారు శ్రీశంకరులు.

# సుఖాన్వేషణ

- శ్రీ సద్గురు బ్రహ్మానందభారతీస్వాములు

ఈ ప్రపంచములోగల ప్రతి మానవుడున్ను సుఖముగా నుండవలెననియే కోరుచు ఆ సుఖమెచ్చట నున్నదో! అని అన్వేషించుచున్నాడు, ఆలోచించుచున్నాడు. ఇట్లాలోచించుచు ఒక నిర్ణయమునకు వచ్చి ``ధనమూలమిదం జగత్" అని నిశ్చయించుకొన్నాడు. యేవిధముచేతనైనా ధనము సంపాదించవలెనని నిర్ణయించుకొని నిద్రాహారములను, పాపపుణ్యములను లెక్కబెట్టక బహుశ్రమలు పడి ధనమార్జించుచున్నాడు. తుదకది మహాదుఃఖమునకు మూలమైనది. యెట్లనగా ధనార్జనయందు నిద్రాహారాదులను మాని శ్రమించునప్పుడు దుఃఖము కలుగును. ధనమును కూడబెట్టిన తరువాత దీనిని ఖర్చు చేసినచో మొత్తము తగ్గిపోవునేమోయని తలంచి, తాను సుఖమును అనుభవించక పెంపు చేయుచునేయుండును. దాని రక్షణయందును దొంగలు దోచుకొందురేమోయని దిగులొందుచుండును. ఇతడు ధనికుడని కొందరు ఇతనిని ఆశ్రయించి ధన సహాయమును కోరెదరు. ఇచ్చినచో మరలా సక్రమముగా తిరిగి ఇవ్వగలరా. లేదా? యను అనుమానము కలుగుచుండును. అప్పుడు దుఃఖమే కలుగును. ఒకవేళ హెచ్చు వడ్డీలకాశపడి ధైర్యము చేసి ఇచ్చినచో వారు తిరిగి ఇవ్వనియెడల కోర్టులకెక్కించితిరుగునప్పుడును దుఃఖమే కలుగును. అంతేగాక యెంత సంపాదించినను తృప్తి చెందుట లేదు. దురాశ తన్ను వెంటాడుచునే యుండి ఇతనిని ముప్పుతిప్పలు బెట్టుచుండును. తుదకు ప్రాణహాని కలిగించునేమోయను భయమున్ను చెందుచున్నాడు. ఈ ధన విషయమై యెటుజూచినను దుఃఖమే కలుగుచున్నదిగదా? ఇక సుఖమెచ్చటనున్నదని ఆలోచించి "భార్యామూలమిదం గృహం" అని తలంచి ఒక స్త్రీని వివాహమాడును. తొలినాడు దంపతులు ఆనందమునే అనుభవించుచున్నారు. తరువాత తమ జీవిత పర్యంతము అనేక సమస్యలకు గురియై దుఃఖమునే అనుభవించుచున్నారు. పిమ్మట "అపుత్రస్య గతిర్నాస్తి" అనితలంచి, సంతానము లేదని దుఃఖించుచు అనేక వ్రతములు, క్రతువులు జపతపములు చేసి సంతానము బడయుదురు. పిల్లలు పుట్టునప్పుడు, వారిని పోషించునప్పుడు, వారికి అనారోగ్యము కలిగినప్పుడు, వారు చదువుకొనక పోయినను, యెక్కువగా చదువుకొని ఉద్యోగము లభించకపోయినను లేదా జ్ఞానియై సన్యసించినను అల్పాయుస్సులో చనిపోయినను, దుర్మార్గుడుగా తయారైనను, తలిదండ్రుల

మాట వినక, దుర్వ్యసనములకు లోనై విచ్చల విడిగా సంచరించినను, తమ్ము ధిక్కరించినను, ఒక సమయము మంచివాడై వానికి తగిన భార్య చిక్కక, కోడలు దుర్మార్గురాలైనప్పుడును వారికి సంతానము కలుగకపోయినను, దుఃఖమునే అనుభవించుచున్నారు. వీటిని ధనేషణ, దారేషణ, పుత్రేషణ అని యందురు. ఈ యీషణత్రయములందనుభవించు ఆనందములు 5. అవేవనగా 1. శబ్దానందము 2. స్పర్శానందము 3. రూపానందము 4. రసనానందము 5. ఘ్రాణానందము. ఈ అయిదింటిని జ్ఞానేంద్రియ విషయములని, పంచతన్మాత్రలని, జీవోపాధులని యందురు. ఈ విషయ సుఖములు, విషతుల్యములు; మరియు ప్రాణాంతకములు. ఎట్లన 1. శబ్దానందముకోరి పుట్టలోనున్న సర్పము బయటికి వచ్చి పాములవానికి జిక్కును. వాడు అప్పుడే దానిని చంపి చర్మమును తీసి అమ్ముకొని జీవించుచున్నాడు. 2. స్పర్శానందముకోరి ఏనుగులు మావటివానిచే జిక్కుచున్నవి. 3. రూపానందము కోరి మిడుతలు అగ్నిలోబడి చనిపోవుచున్నవి. 4. రసనానందమును కోరి చేపలు యెఱ్ఱను తినవలెనను ఆశచే గాలములో జిక్కి మరణించుచున్నవి. 5. ఘ్రాణానంధమును కోరి యెలుకలు బోనులో చిక్కి ప్రాణములు కోల్పోవుచున్నవి.

ఒకానొకడు ఈ విషయములన్నియు నాలోచించి ఒక గురువు వద్దకు వెళ్ళి, స్వామీ! ఆనందమెచ్చటగలదు? అని ప్రశ్నించెను. అది నీలోనే యున్నదని గురువు చెప్పెను. అదెట్లనగా కొందరు మానవులు మాంసమును తిని యెముకలు పారవేతురు. కుక్క ఆ యెముకను కొరకును. ఆ యెముక, కుక్క పళ్లలో గ్రుచ్చుకొని, ఆ పళ్ళనుండి స్ర వించు రక్తము యెముకలో నుండి వచ్చుచున్నదని తన రక్తమును తానే త్రాగుచు, ఇది యెంత రుచికరముగా నున్నది? అని యానందించును. తుదకు దాని దవుడలు ఊడిపోయి బాధ కలిగినప్పుడు విరక్తి గలిగి ఆ యెముకను పారవైచి వెళ్లును.

అట్లే మానవులున్ను. తాము కోరిన ఆనందము తనలోనే యున్నదను సంగతి మరచి అన్యదృశ్య వస్తువులలో ఆనందము గలదని భ్రమించి పతనమైపోవుచున్నారని గురువు చెప్పగా విని, శిష్యుడు ఆ యానందము తనలో యెచ్చట గలదు స్వామీ! యని మరలా ప్రశ్నించెను. అందుకు గురువు ``జననీ, జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ!" ``జన్మభూమియు,తల్లియు జగతిలోన, స్వర్గమునకన్న నెక్కుడు సౌఖ్యదములు" తా॥. తాను జన్మించిన భూమియందును, తన్నుకన్న తల్లివద్దను ఉన్న సుఖము, స్వర్గసుఖముకన్నా యెక్కువైనది. అనగా అదియే మోక్షము. బ్రహ్మానందదాయకమైనది అని చెప్పెను.

అందులకు శిష్యుడు స్వామి! జన్మభూమిలో సుఖమున్నదని చెప్పితిరి గదా! కాని మానవులు ధన సంపాదనకొ రకున్ను, సుఖించుటకొ రకున్ను, తమ గ్రామములను వదలి గ్రామాంతరములకున్ను, స్వదేశమును వదలి పరదేశములకు వెళ్ళిచుండుట, అచ్చట స్థిర నివాసమేర్ప చుకొని అచ్చటనే యుండుట మనకు ప్రత్యక్షానుభవముగానున్నది. అంతేగాక తల్లివద్దనే బిడ్డలులేరు. 3 సంవత్సరములకు శిశువిహార (బాల్వాడి స్కూలుకును) 6 సంవత్సరములనుండి ప్రాథమిక పాఠశాలకున్ను, తరువాత ఉన్నత పాఠశాల మరలా కళాశాలకు వెళ్ళి చదువుకొని, తరువాత జీవనోపాధికి ఉద్యోగము సంపాదించుకొని యెచ్చటెచ్చటికో వెళ్ళి నివసించుచు, వీలును బట్టి తల్లిదండ్రుల వద్దకు వచ్చి వెళ్ళుచుండుటయు మనకు ప్రత్యక్షానుభవమే, జన్మించిన పిమ్మట 3 సంవత్సరముల వరకు మాత్రమే తల్లివద్ద బిడ్డ యుండును. ఇట్లుండ శాస్త్ర ప్రమాణమేమైనట్లు స్వామి! యనెను. మరలా గురువు యిట్లు చెప్పెను.

*అనుభవము :*

లోకములో ప్రతి మానవుడున్ను నా ధనము నా భూమి, నా యిల్లు, నా తల్లి, నా తండ్రి, నా భార్య, నా పిల్లలు అని చెప్పుచున్నాడు. వీటికన్నింటికి వేరుగా యుండి అవి నావి, వీరందరు నావారని చెప్పుచున్నారుగదా! నా తల్లి అన్నపుడు తల్లికొక నిర్ణయ స్థానము, బిడ్డకొక నిర్ణయ స్థానములున్నయున్నవి. కంటిచూపు వీరిద్దరిని కలుపుచున్నది. నా తల్లి అని చెప్పువాడు ద్రష్ట కనబడు తల్లి దృశ్యము. చూసే చూపుదృక్కు. వీటినే త్రిపుటియనియందురు.

అట్లే ప్రతి మానవుడున్ను నా శరీరము, నా యింద్రియములు, నా మనసు, నా బుద్ధి, నా ప్రాణము, నా జీవుడు, నాయాత్మయని చెప్పుచుండుటయే యెల్లరకు విదితమే. కాని ఇతరులు నీవెవ్వరని యడిగినప్పుడు, నేను ఫలానా తలిదండ్రులకు పుట్టినవాడును. నా పేరు ఫలానా, నా కుల గోత్రములివి అని చెప్పుచున్నాడు. ఈ శరీరమునకు 5 అవస్థలుగలవు. 1. జననావస్థ 2. మరణావస్థ. ఈ రెండును వేర్వేరు సమయములందు ఒకసారి మాత్రమే జరుగును. తక్కినవి 1. జాగ్రత్త, 2. స్వప్నము 3. సుషుప్తి. ఈ మూడవస్థలు ప్రతి దినము జరుగుచుండును. ఆయవస్థలను కూడా, నేను మేలుకొనియున్నాను. నేను కలగన్నాను. నేను

కారణ శరీరములున్న "జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి" యవస్థలు దృశ్యములు. వీటిని చూచు జ్ఞానముదృక్కు అయినవి. ఈ ద్రుష్టయెవరు? యెచ్చటనున్నాడు? యే రూపముతో నున్నాడు? యెట్లు చూచుచున్నాడు. తాను కోరిన ఆనందమెచ్చటగలదు? అని యాలోచించినచో...

ఒక నిరుపేద వానికి, ఒక బిందెడు బంగారము లభించనది. తొలి దర్శనములో అతనికి కలిగిన ఆనందము వర్ణనాతీతము. తరువాత ప్రతి దినమున్ను ఆ బంగారమును చూచుచుండును. కాని తొలి దర్శనమందు కలిగిన ఆనందము తరువాత లేకపోవుటే గాక మరికొన్ని బిందెలు బంగారము లభించిన బాగుండును గదా? యని అనుకొనును. ఈ యానందము ధనములోనున్నదా? తనలోనున్నదా? యని ఆలోచించినచో తనలోనే యున్నది అని తెలియుచున్నది.

ఒక భాగ్యవంతునకు సంతానము లేకనే యుండి, వృద్ధాప్య దశలో వారికొక పుత్రుడు జన్మించెను. తరువాత 3 సంవత్సరములకు తండ్రి చనిపోయెను. తల్లి భర్త వియోగ దుఃఖముననుభవించుచు, బిడ్డను అల్లారు ముద్దుగా పెంచుచు, చదివించుచుండెను. బిడ్డకు 15 సంవత్సరములైనవి. అతడు తప్పు చేస్తే, తల్లి కఠినోక్తులతో దండించెను. బిడ్డ తల్లిపై కోపించి, దేశాంతరమునకు వెళ్లిపోయెను. తదుపరి తల్లి దుఃఖితురాలై దేశమంతటా వెదకించెను. పత్రికా ప్రకటనలు చేయించెను. కాని పుత్రుని ఆచూకి చిక్కలేదు. తుదకు పుత్రుడు చనిపోయి యుండునని నిశ్చయించి, పుత్ర వియోగ దుఃఖమును కూడా అనుభవించుచు, దుఃఖించుచుండెను. పుత్రునుకు 30 సంవత్సరములైనవి. తల్లి మీద ఆశ జనించెను. తల్లి దగ్గరకు వెళ్ల నిశ్చయించుకొని తిరిగి యింటికి వచ్చెను. బిడ్డ చనిపోయినాడని, పుత్రశోకముతో కుమిలి పోవుచున్న తల్లివద్దకు కుమారుడు వచ్చిన వెంటనే తల్లి చూచినది. చనిపోయినాడనుకొన్న బిడ్డ మరలా తిరిగి వచ్చినాడు గదా! యను ఆనందముతో బిడ్డను కౌగిలించుకొని ముద్దాడెను. ఈ తొలి దర్శనమందున్న ఆనందము వర్ణనాతీతము. తరువాత తల్లి బిడ్డ ఒకేచోటున యుండి ప్రతి దినము చూచుకొనుచు సంభాషించుచుందురు. కాని తొలి దర్శనమందున్న ఆనందము మరలా కలుగలేదు. ఈ ఆనందము బిడ్డలో నున్నదా? తనలో నున్నదా? యని ఆలోచించినచో, తనలోనే యున్నది. ఒక పదార్థము దృశ్యమైనప్పుడు తనలోనున్న ఆనందము వ్యక్తమై, మరలా తనయందే గుప్తమగుచున్నది. ఈ యానందమునే ప్రతి వారును కోరుచు అన్వేషించుచున్నారు. ఇది సుఖాన్వేషణము యొక్క వైచిత్రి.

# విశ్వశాంతి ప్రదాత శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ

- *శ్రీఅచ్చిరాజు వేంకట రమణారావు*

నాకు మొదటిసారిగా శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ వారి దర్శనము గుంటూరు విశ్వమందిరములో 1990లో లభించింది. ఆ రోజుల్లో నేను గుంటూరు జిల్లాలోని మాచర్ల డిగ్రీ కాలేజీలో హిందీ లెక్చరరుగా పనిచేస్తూ వుండేవాడిని. శ్రీస్వామివారిని దర్శించటంలో నా వుద్దేశ్యము నా సంతాన అనారోగ్యం విషయం నివేదించి వారి నుండి వ్యాధి నివారణోపాయం తెలిసికొనాలని మాత్రమే. ఆనాడు శ్రీస్వామీజీ ఒక ఫోటో మరియు విభూది పొట్లాలు అనుగ్రహించారు. ఆ ఫోటోలో శ్రీదత్తాత్రేయ స్వామి, శ్రీషిరిడీసాయి, శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ ముగ్గురు చిత్రములు వున్నవి. తరువాత విశ్వగురు చరిత్ర రచయిత శ్రీవిద్యాసాగర శర్మగారి ద్వారా తెలిసిందేమంటే "ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త " అను మంత్రము యొక్క గురుస్వరూప చిత్రము అదే. ఆ మంత్రమును జపించేటప్పుడు ఆ స్వరూపాన్ని మననం చేయటం మన ధర్మం. విశ్వగురుతత్త్వ లక్షణము ఆ మంత్రమే. అంతటి శక్తిమంతమయిన ఫోటో యిచ్చి శ్రీస్వామీజీ నన్ను ఆశీర్వదించినందులకు నేను చాలా ఆనందపడితిని.

నా కుమారుని విద్యాభ్యాస నిమిత్తమై నేను 1992లో సకుటుంబముగా గుంటూరు రావలసి వచ్చినది. నా సోదరుడు శ్రీఅచ్చిరాజు సుబ్బారావు ద్వారా శ్రీవిశ్వయోగి విశ్వంజీ వారి సాన్నిధ్యంలో స్థానం లభించింది. శ్రీ స్వామీజీ దయతో మా కుటుంబ పరిస్థితులు తెలిసికొని మా సంతానముయొక్క అనారోగ్యమును తొలగించుటకు ఆవశ్యకమయిన సూచనలు చేసినారు. ఆ సలహాలు పాటించుట ద్వారా కుటుంబములోని అశాంతి తొలగిపోయి శాంతి నెలకొన్నది. శ్రీస్వామీజీ ప్రసాదించిన" ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త " అనే మంత్రమును సదాస్మరిస్తూనే వుంటాము.

శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ అపార కరుణా సముద్రులు. వారి కృపా కటాక్షము వలన అసంఖ్యాక ప్రజలు అనేక ప్రయోజనములు పొందుచున్నారు.

వారి ధ్యేయము విశ్వశాంతి, విశ్వకల్యాణము. ఈ ప్రపంచములో వారి శాంతికాముకత, కీర్తి ప్రతిష్ఠలు ఆ చంద్రతారార్కము కొనసాగుతూ వుంటవి ఈ విశాల విశ్వమంతా శాశ్వతంగా వారికి ఋణపడియే వుంటుంది. వారి త్యాగనిరతియందు యే త్యాగమయినను సూర్యునిముందు కరదీపిక ఉంచుటవంటిదే అగును. ఈనాటి వరకు మన ఈ భరతభూమిలో యే యోగి అయినను ఈ విధంగా విశ్వశాంతి కొరకు శ్రమించినవారు అరుదు. కొందరుప్రబోధకులు స్వీయ ప్రయోజనమునకె పాటుపడెరే కాని శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ వారివలె ప్రాప్తించిన శక్తులను విశ్వశాంతి కొరకు వ్యయం చేసినవారు కారు. ఈనాటి సామాజిక, రాజకీయ, పారివారిక, ధార్మిక పరిస్థితులు అస్తవ్యస్తముగా వున్నవి. వర్గ, వర్ణ, భాషా, మత భేదములతో హింసావాదము వెర్రితలలు వేస్తున్నది.

ఇట్టి పరిస్థితులలో సాక్షాత్తు దత్త ప్రభువు శ్రీవిశ్వయోగి విశ్వంజీవా ఆవిర్భావము శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధించిన గీతా శ్లోకమునొక దానిని తలపింపజేయుచున్నది.

" యదాయదాహి ధర్మస్య, గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం "

ఈనాటి పరిస్థితులలో శ్రీవిశ్వయోగి విశ్వంజీవారు దత్తావతారులై అవతరించుట సర్వవిధముల తగియున్నది శ్రీవిశ్వంజీవారు దత్తావతారులు అనే విషయం కుర్తాళం పీఠాధిపతులు, శ్రీశివచిదానంద భారతీ స్వామి ఆదిగాగల మహాత్ములందరును ధ్రువీకరించియున్నారు. శ్రీవిశ్వయోగి విశ్వంజీ విశాల హృదయులై సర్వజనులకు శాంతి ప్రదానం చేస్తున్నారు. వారి ప్రబోధ ఆశయము, వ్యక్తి సంస్కారము, తద్వారా కుటుంబశాంతి, దానివలన సమాజశాంతి, విశ్వశాంతి సాధ్యమనేది వాస్తవిక మరియు నిర్మాణాత్మకమయిన దృక్పథము. వారి సూక్తులు యెంతటి వారిలోనైనాను ప్రేరణ కలిగించి కార్యోన్ముఖులను జేయగలవు. ఉదాహరణకు **Work is worship. Duty is god.** వారు భిన్న భిన్న ధర్మములు సనాతన ధర్మములో అంశముల, సనాతన ధర్మములో వర్ణ, వర్గ, భాషా, ధర్మ, ప్రాంత, జాతిగత భేదములకు తావులేదు అని అంటారు. సనాతన ధర్మ పునరుద్ధరణయే వారి ధ్యేయము. సత్యము, శీలము, సర్వమానవ సమైక్యములకు అధిక ప్రాధాన్యము కలదు. ప్రేమమార్గము ద్వారా యెట్టి కఠిన హృదయునైనా తన మార్గమునకు మార్చగల సామర్థ్యము శ్రీస్వామివారియందు కలదు

శ్రీవిశ్వయోగి విశ్వంజీవారి వలన కలిగిన అనుభూతులు, అనుభవాలు, ప్రయోజనాలు వ్రాసుకుంటూ పోతే ఒక్కొక్క వ్యక్తికి సంబంధించి ఒక్కొక్క గ్రంథముగా రూపొందగలదు. శ్రీస్వామీజీ పిలిస్తే పలికే దైవము వారి సూక్ష్మశరీరము వారి భక్తులను అజ్ఞాతంగా అనుసరిస్తూనే వుంటుంది. వారి భక్తులకు ఎక్కడ యేమి జరుగుచున్నదో వారికి తెలుస్తూనే వుంటుంది. వారి కన్నులు ప్రపంచమంతటిని పరిశీలిస్తూ వుండగలవు మనం కన్నులు తెరిస్తేనే కొంత పరిమితి వరకు చూడగలం. కానివారు కన్నులు మూసికొని సర్వ ప్రపంచాన్ని చూడగలరు. వారి కర్ణములు వారి భక్తుల సంభాషణములు యెచట నుండి అయిన వినగలవు వారి యెదుట అసత్యము చెప్పి తప్పుకొనలేరు. వారు త్రికాలజ్ఞులు సర్వజ్ఞులు. ఈ సందర్భములో మా కుటుంబముకు సంబంధించిన అనుభవములలో కొన్నింటిని మాత్రమే పొందుపరచుచున్నాను.

1. మేము మాచర్ల నుండి గుంటూరు వచ్చిన క్రొత్తలలో **(1992)** విశ్వమందిరమునందు ప్రతి దినమూ పూజలు జరుగుచుండేవి. పూజా కార్యక్రమము సమాప్తి కాగానే స్వామీజీ అందరిచేత హారతి యిప్పించేవారు. మేము కూడా ప్రతిరోజు కర్పూరము, అగరుబత్తీలు, పండ్లు, పూలు తీసికొని పూజా కార్యక్రమంలో పాల్గొంటూ వుండేవారము ఒకరోజున నాభార్య అధిక పరిమాణంలో కర్పూరం మందిరానికి తీసికొని వెళ్ళే ప్రయత్నం చూచి నేను కోపగించుకొన్నాను. అంతే ఆ రోజు పూజ సమాప్తి అయిన తరువాత శ్రీ స్వామీజీ నేను హారతి యివ్వబోతే అనుమతించలేదు ఆ సంఘటన నన్ను కలచివేసింది. అయితే నా తప్పును తెలిసికొని మనసులోనే క్షమాపణ కోరుకొన్న మీదట మరలా నన్ను హారతి యివ్వటానికి అనుమతించినారు. ఈ విషయం సన్నిహితులతో ముచ్చటించి శ్రీస్వామివారి శక్తిని గూర్చి తలంచుకొని ఆనందించినాము.

**2.** ఒక రోజు రాత్రి విశ్వమందిరములో సత్సంగ గోష్ఠి జరుగబోతుంది. నేను, నా భార్య స్వామివారి దర్శనం చేసికొని గృహోన్ముఖులమైనాము. కాని శ్రీస్వామీజీ మా యిద్దరిని గోష్ఠిలో పాల్గొనుటకై ఆదేశించినారు. మేము కూర్చొన్న కొద్దిసేపటికి వెళ్ళిపొండని ఆజ్ఞాపించారు. మాకు కారణం తెలియక ఆలోచిస్తూ యింటికి చేరినాము. అప్పటికే మా కుమార్తె కంటికి గాయమై ముఖమంతా రక్తసిక్తమై యేడుస్తూ వుండింది. అప్పుడు మాకు శ్రీస్వామీజీ యెందుకు వెళ్ళమన్నారో అర్థమయింది. వెంటనే శ్రీస్వామిజీ వారి విభూతిని గాయం చుట్టూ ఉపయోగించి మందువేస్తే మూడవ రోజుకే నయమయింది. వాస్తవముగా అది కుట్లు పడవలసిన గాయం. శ్రీస్వామీజీ కృపవలన మా పాపకన్ను

రక్షింపబడింది. ఇపుడు యేకంటికి గాయమయిందో గుర్తించలేనంతగా నయమయింది.

**3.** నేను కాలేజీలో హిందీ ఉపన్యాకుడుగా పని చేసినంత కాలమూ ఒక్క పద్యము కూడా హిందీలో వ్రాయటం జరుగలేదు అనుభవం లేక. శ్రీస్వామిజీ శ్రీవిద్యాసాగర శర్మగారు తెలుగులో వ్రాసిన విశ్వగురు చరిత్రను నన్ను హిందీలోనికి అనువదించమని ఆదేశించినారు. అందులో పద్యములు కూడా వున్నవి. పద్యములు అనువదించుటలో నా అశక్తతను వెల్లడించగా శ్రీస్వామివారే స్వయంగా ఒక పద్యమును అనువదించి యిలా చేయమని ఆశీర్వదించారు. తరువాత జరిగిన హిందీ అనువాదమును (పద్యములలో) చూసి నాకే ఆశ్చర్యము కలిగింది. శ్రీస్వామివారి ఆశీస్సులు యెంత ప్రభావభరితములో తలచుకొంటేనే ఆశ్చర్యము, ఆనందము కలుగుతుంటాయి.

**4.** నేను శ్రీస్వామివారి ఆశీస్సులతో విశ్వగురు చరితం అనే హిందీ అనువాదము వ్రాస్తున్న రోజులలో ఒకనాడు శిరోబాధతో శ్రీస్వామిజీ దర్శనార్థము విశ్వమందిరముకు వెళ్ళాను. దర్శనం అయింది. నేను యింటికి రాబోతుండగా వారు నన్ను కూర్చోమన్నారు. కొంతసేపు అయిన తరువాత యిక వెళ్ళటానికి అనుమతించినారు. మందిరము బయటకు రాగానే నా తలనొప్పి మటుమాయమయింది. శ్రీ స్వామీజీ యెందుకు కూర్చోమన్నారో అపుడు అర్థమయింది. శ్రీస్వామిజీ యిలా కోరకుండానే యెంతోమందికి బాధా నివారణ చేస్తున్నారో ఊహించలేము.

**5.** ఒకసారి ప్రభుత్వము వారు **1976** నుండి **U.G.C.** స్కేలులో జీతములు పొందే అర్హతగల ఉపన్యాసకుల జాబితాలో నా పేరు చేర్చలేదు. తత్సంబంధముగా ఒక దరఖాస్తు తయారు చేసికొని శ్రీస్వామిజీ యిచ్చిన విభూతితో స్పర్శించి పోస్టులో హైదరాబాదు పంపినాను. నేను తరువాత విచారణ చేయగా నా పేరు అర్హతగల ఉపన్యాసకుల జాబితాలో చేరినట్లు

ఇలా యింకా యింకా ఎన్నో అనుభవాలు వున్నై . అవన్నీ వ్రాస్తూ పోతే యింకా విషయం విస్తరణ జరుగుతుంది. అందుచే మహదాశయము అయిన విశ్వశాంతి స్థాపన మహాయజ్ఞములో నన్ను కూడా ఒక ప్రయోజనకరమయిన ఉపకరణముగా అగుటకు శ్రీశ్రీశ్రీవిశ్వయోగి విశ్వంజీ ఆశీర్వదించగలరని విశ్వశిస్తూ ఈ వ్యాసమును ముగించుచున్నాను.

*ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త.*

# శ్రీజ్ఞానానందుల శ్రీకృష్ణోపాసన

- శ్రీమేడూరి వెంకటసోమేశ్వర కృష్ణమూర్తి

*[తెలుగునాట ప్రభవించిన ఆధునిక ఆధ్యాత్మిక దివ్య విభవులలో శ్రీ స్వామిజ్ఞానానందది విశిష్టస్థానం. చిన్ననాటనే వైరాగ్యంతో ఇల్లువిడిచి హిమాలయ తపోభూములలో తీవ్రమైన తపస్సు చేసి అవధూతగా అవతరించి, భక్తి జ్ఞాన కర్మ రాజయోగాలను సమన్వయించే `పూర్ణసూత్రాలు' రచించి ఆ తర్వాత విజ్ఞాన శాస్త్రగవేషణలో జర్మనీ, జకొస్లోవేకియా, ఇంగండు, అమెరికాలలో పరమాణు భౌతిక విజ్ఞాన శాస్త్రంలో మహత్తరమైన పరిశోధనలు జరిపి డి.ఎస్సి, పిహెచ్.డి, నిగ్మాకై స్, ఎఫ్.ఫి.ఐ మొదలైన మహత్తర గౌరవాలు పొంది ఢిల్లీలో నేషనల్ ఫిజికల్ లాబరేటరీలో పరిశోధనాధికారియై, ఆంధ్ర విశ్వవిద్యాలయ పరమాణు భౌతిక విజ్ఞాన శాస్త్ర సంస్థాపకాచార్యులై ఎందరు పరిశోధన విద్యార్థులనో తర్ఫీదు చేసి, పరమాణు భౌతిక విజ్ఞాన శాస్త్రంలో ఎన్నో గ్రంథాలు రచించిన విశిష్ట మూర్తిమంతం శ్రీస్వామి జ్ఞానానంద మహాశయులది. భక్తి జ్ఞానకర్మ మార్గాల త్రివేణి సంగమం ఆయన. తమ పరమగురువుల శ్రీకృష్ణోపాసనను గూర్చి ఇందులో రచయిత వివరిస్తున్నారు. రచయిత రామభక్తులు, శ్రీచక్రోపాసకులు, దైవజ్ఞులు. బహు గ్రంథకర్త సం ॥]*

---

`కృష్ణస్తు భగవాన్ స్వయం'. పరమగురు దేవులు శ్రీజ్ఞానానందుల ఉపాసనా దైవం శ్రీకృష్ణపరమాత్మ షోడశ కళా ప్రపూర్ణుడు. భగవద్గీత దాత. పురుషోత్తముడు. సచ్చిదానందఘనుడు. ప్రేమామృతమూర్తి. అభ్యుదయానికి, నిశ్రేయస్సుకు సాకార విగ్రహం. ఇంద్రుని శక్తి గర్వాన్ని, బ్రహ్మ జ్ఞాన గర్వాన్ని అణచినవాడు. మహీపతుల గర్వ జ్వరాన్ని ఉపశమింపచేశాడు. కంసవధ, పూతనవధ చేయడమేగాక, గోవర్ధనోద్ధరణ చేసాడు. గోపిలకు పరంధామం దర్శింపచేశాడు. సుదర్శనోద్ధరణ చేసినవాడు. కుబ్జకు తిన్నని శరీరమిచ్చినవాడు. నృగుని ఉద్ధరించినవాడు. మృతగురు పుత్రుని తెచ్చినవాడు. ద్రౌపదికి వలువలిచ్చినవాడు. విరాట్స్వరూపం చూపినవాడు. జయద్రథుని వధ సమయాన సూర్యాస్తమయము అకాలంలో చేయించినవాడు. ఉత్తర గర్భాన మృతుడైన పరీక్షిత్తుని జీవింప చేసినవాడు. నారదునకు ప్రతీ భవనంలో దర్శనమిచ్చినవాడు. ఈ శరీరంతోనే పరమధామం చేరినవాడు.

అనే ఈ పరమ మహావాక్యంకు అర్ధం వేదాలలో, ఉపనిషత్తులలో ఉంటే అది అందరుకు అందడం కష్టమని దానిని సులభం చేసి, ఆ వివరణ శ్రీ జానానంద మనకు అందించారు.

కర్రతో ఉన్న ఇనుము నీటిపై తేలునట్లు, పువ్వులోని పురుగు దేవుని శిరస్సు ఎక్కగలిగినట్లు శ్రీజ్ఞానానంద పరమగురు దేవుల కృపచే నావంటి వారం భగవత్సాన్నిధ్యం చేరే బాటను పట్టి పయనిస్తున్నాము.

శ్రీకృష్ణభక్తురాలు మీరాబాయిని చంపాలని ఆమె దగ్గ కు సింహాన్ని పంపారు. ఆమె ఆ సింహాన్ని నృసింహునిగా భావించి హారతిచ్చి, పుష్పమాల వేసి, నీటిని చల్లినదట! ఆ సింహం వెళ్ళిపోయింది. అటులనే జ్ఞానానంద మహరాజ్ ఒంటరిగ మంచుకొండలలో సంచరిస్తూ కృష్ణనామం చేస్తూ ఉంటే ఎదురుగా పెద్దపులి వచ్చినదట! ఆ మహాత్ముడు బిగ్గరగ `ఓంకారము చేయగానే అది తోకముడిచి వెనుదిరిగిపోయినదట!

రాగంలేని విరక్త పురుషుడు శ్రీజ్ఞానానందులు. ఆయన చిత్తంలో ఏకాగ్రత వుంది. అందుకనే ఆయనకు ధ్యానం కుదిరింది. చిత్తం స్థిరంగా ఉండిపోయింది. అట్టి మహాత్ముని స్మరిస్తే ధ్యానించే మన బుద్ధి, చిత్తం స్థిరత్వం చెందుతాయి.

"యే యం రాధాయశ్చ కృష్ణోరసాబ్ధి-
ర్దేహశ్చై చకః క్రీడనార్థం ద్విధాభూత్! "

*(రాధా తాపనీయోపనిషత్తు)*

శ్రీకృష్ణుడు, రాధ ఒక్కటే. కాని ఒక్కరే రమించలేరు గనుక ఇద్దరిగ మారి రమిస్తారు. ఒక భక్తుడు అంటాడట, శ్రీకృష్ణుడు గొప్ప ఐశ్వర్యవంతుడని. అంటే గోపికలు అన్నారుట ``ఆ ఖజానా తాళం చెవి మా దగ్గ ర ఉన్నది" అదే విధంగా శ్రీకృష్ణోపాసనకు భక్తులకు శ్రీజ్ఞానానందులు తాళం చెవి మనకిచ్చారు. తాళం చెవి ఉపయోగిస్తే ఆ అంఖడ పరమా నందైశ్వర్యాన్ని పొందవచ్చు.

శ్రీజ్ఞానానంద చూపిన బాటపై వారి ప్రధాన శిష్యులు శ్రీప్రజ్ఞానానంద, శ్రీప్రణవానంద, శ్రీబ్రహ్మానందగిరి ఇత్యాదులు, తమ తమ శిష్యపరంపరంతో ముందుకు సాగారు. పై ముగ్గురు తరించి ముక్తి చెందారు. వారి శిష్యగణం

అదే మార్గంలో పయనిస్తూ శ్రీజ్ఞానానంద ప్రవచించిన, విశ్లేషించిన విషయాలు ప్రచారం చేసి కలహానికి మారుపేరు అయిన ఈ కలి ప్రభావం భక్తులపై పడకుండా కృషి చేస్తున్నారు.

విరాగియైన శ్రీజ్ఞానానందకు సాంసారిక సుఖాలు చెడుగ తోచినవి. పాముకరిస్తే విషం నరనరానికి ఎక్కినట్లు, సముద్రపు నీరు కెరటాలుగ మారి ఎగిసిపడినట్లు, కరెంటు తాకితే అది శరీరమంతా ప్రాకి బాధ కలిగినట్లు, శ్రీజ్ఞానానంద కృష్ణానందంలో మునిగితేలారు. అమృతం త్రాగిన వానికి మధుర పదార్థాలు అరుచిగ ఉంటవి. సాంసారిక భోగాలపట్ల జ్ఞానానంద స్థి:

"బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్దత్మాత్మని యత్సుఖమ్!
స బ్రహ్మ యోగ యుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే!! "
*(శ్రీమద్భాగవతము 5వ అధ్యాయము 21వ శ్లోకము)*

జగత్తు అంతా ఆ శ్రీకృష్ణ పరమాత్మ స్వరూపంగా, అమృత సాగరంగా గోచరించి జ్ఞానానంద ఆనందంలో మునిగితేలారు.

శ్రద్ధలేనిదే ఉపాసన కుదరదు. ఉపాసన లేనిదే భగవత్కృప పొందలేము. భగవత్కృప లేనిదే పరమాత్మను పొందలేము. పరమాత్మను పొందలేకపోతే దుఃఖాల నుండి విముక్తిలేదు.

"అకామః సర్వకామో వా మోక్ష కామ ఉదారధీః!
తీవ్రేణ భక్తియోగేన యజేత్ పురుషం పరమ్!! " *(భాగవతము)*

భక్తునిలో ఎన్ని సద్గుణములున్నా తీవ్రభక్తి ద్వారా మాత్రమే అతడు భగవంతుని పొందగలడు. పసిపిల్లవాడు తల్లిమీద ఆధారపడినట్లు భక్తుడు నిత్యం భగవంతునిపై ఆధారపడతాడు. పసివానికేమి ఇచ్చినా తీసుకోడు. తనకు అమ్మే కావాలంటాడు. భక్తుడు భగవంతుడే కావాలంటాడు. సుఖాలు, భోగాలు, ఐశ్వర్యం, బంధువర్గం, సర్వం వదులుకొన్న శ్రీజ్ఞానానంద నక్తియే ఇందులకు ఉదాహరణము.

* * *

# శ్రీరామకృష్ణ పరమహంస దివ్యభాషణములు

*సేకరణ : అక్కిరాజు రమాపతిరావు*

* ఈ క్రింది స్థితిగతులలో నేదైన నొకటి యనుభవమునకు దెచ్చుకొన్నవాడు సిద్ధుడగును. 1.. ఈ విశ్వమంతయు నేనే 2. ఈ విశ్వమంతయు నీవే 3. నీవు యజమానుడవు, నేను సేవకుడును.

* భగవంతుని కనుగొనుటకు నీవు నీ శరీరమును, నీ మనస్సును, నీ సంపదలను బలిపెట్టనక్కరలేదు.

* తన సేవకుని గృహమునకు రాజు పోదలచుకొన్నప్పుడు సేవకుడు తనకు తగిన సన్మానము చేయుటకై తన పీఠములు, తన నగలు, భోజన పదార్థములు, వాని యింటికి బంపును. అట్లే భగవంతుడు తానే హృదయమునందు ప్రవేశింపదలచుకొన్నాడో యా హృదయములోనికి వినయ వివేకములను భక్తివిశ్వాసములను ముందుగా బంపును.

* చల్లని గాలి వీచుచున్నప్పుడు విసనికర్రలు విడిచి పెట్టవలెను. దైవానుగ్రహము కలిగినప్పుడు జపములు, తపములు, ప్రార్థనలు పరిత్యజింపవలెను.

* భగవంతుడు మనుష్యులందరిలోనున్నాడు కాని ప్రతి మనుష్యుడు భగవంతునిలో లేడు. మనుష్యులు విశేష దుఃఖమనుభవించుట కిదియే కారణము.

* ఎల్లకాలము నుపవాసము చేయువాడెవ్వడును లేడు. కొందరు జాము ప్రొద్దెక్కి భోజనము చేయుదురు. కొందరు రెండు జాములప్పుడు తిందురు. కొందరు మూడు జాములవేళ భుజింతురు. కొందరు రాత్రి భుజింతురు. అట్లే ఈ జన్మలోను మరియొక జన్మములోను అనేక జన్మాంతరములైన తరువాతను యెప్పుడో యొకప్పుడు మనుష్యుడు పరమేశ్వరుని దర్శనము చేయును.

* పండు చెట్టున పక్వమై మాగి తనంతట నేల రాలినప్పుడది మిక్కిలి రుచి కలిగి యుండును. అట్లుగాక పండకముందే చెట్టునుండి కోసి మగ్గవేసితిమేని యది రుచి తగ్గిపోవును. అట్లే మనుష్యుడు జ్ఞాన పరిపక్వదశ నొందినప్పుడు వర్ణభేదములు మొదలైనవి తమంత తామే వదిలిపోవును. ఆ పరిపక్వదశ వచ్చువరకు మనష్యుడట్టి భేదములను తప్పక పాటింపవలయును.

* తుఫాను పట్టినప్పుడు యేది యే చెట్టో మనము చప్పున చెప్పజాలము. ఒకటి మఱ్ఱిచెట్టో రావిచెట్టో తెలిసికొనుట కష్టము. అట్లే సత్యజ్ఞానమనెడి తుపాను రేగినపుడు వర్ణభేదములు కనపడవు.

ప్రశ్న: "మీరు భార్యతో కలిసి సంసారమెందుకు చేయుదురు?" అని యొకరు రామకృష్ణ పరమహంసనడిగిరి.

సమాధానము: దేవతల సేనాపతియైన కుమారస్వామి యొకనాడు తన గోటితో నొకపిల్లి చెంపమీద బరికెను. ఇంటికివెళ్ళిన తర్వాత తల్లియైన పార్వతీదేవి యొక్క చెంపమీద బరుకులు కనపడెను. అది చూచియతడు "అమ్మా నీ చెంపమీద బరుకులెందుకు వచ్చినవని" యడిగెను.

పార్వతి యతనికిట్లనియె. "కుమారా, ఇది నీ పనియె. నీ గోటితో నీవే బరికితివి. అనవుడు కుమారస్వామి మిక్కిలియాశ్చర్యముతో నిట్లనియె." అమ్మా నేనెన్నడు నిన్ను బరికినట్లు జ్ఞాపకము లేదే. నీవేల నిట్లనుచున్నావు." అని పలికెను. "కుమారా! నీవు నేడొక పిల్లిని బరకలేదా" అని పార్వతి యడిగెను. "అవును. బరికితిని కాని నీ చెంప మీద బరుకులెందుకు యుండవలయును."

అనవుడు దుర్గయిట్లనియె.

"కుమారా! యీ ప్రపంచమున నేను తప్ప మరియొక వస్తువు లేదు. నేనే సృష్టి. నేనే చరాచర ప్రపంచము. నీవు ఎవరికి ఏ హాని చేసినను నాకు చేసినటే."

ఆ పలుకులు విని కార్తికేయుడు మిక్కిలి విస్మయమొంది వివాహము

స్వరూపము లేయగుటచే నతని దృష్టికి ప్రతి స్త్రీయు తన తల్లియగు దుర్గవలెనే కనబడెను. నేనా కుమారస్వామి వంటి వాడనే. లోకమునగల ప్రతియాడుది నా కంటికి లోకమాతయగు పార్వతి వలెనే గనపడుచున్నది."

* నక్కకూ తలన్నియు నొక్క మచ్చుననే యుండును. ప్రపంచమందలి జ్ఞానులందరి యొక్క బోధ లొక్క విధముననే యుండును.

* ఈ ప్రపంచమున మనకు సుఖము గలుగజేయునట్టి ప్రతి విషయమునందు గొప్పగానో కొంచెముగానో పరమేశ్వర సంబంధముండును. బెల్లమునకు, పటిక బెల్లమునకు నెట్టి భేదమున్నదో నట్టి సుఖమునకు నీశ్వర సంబంధముగల సుఖమునకు నట్టి భేదము గలదు.

* తెల్లబట్ట మీద నల్లని మంటి చుక్కబడునేని చుట్టుప్రక్కలనున్న తెల్లదనము ముందర ఆ నలుపు మిక్కిలియసహ్యముగా నుండును. అట్లే పవిత్రుడైన సాధువు దగ్గర మిక్కిలి చిన్న తప్పున్నను మిక్కిలి ఘోరముగా కనపడును.

* సూర్యకాంతి యన్ని వస్తువుల మీదను సమానముగానే బడును. కాని యద్దములు, నీళ్ళు, మెరుగు చేసిన లోహములు మొదలగు తళతళలాడు వస్తువులలో నది ప్రతి ఫలించును. ఈశ్వర తేజమిట్టిదే. అది యెల్లవారి హృదయముల మీద పక్షపాతము లేక సమానముగా బడును. కాని సాధువు యొక్కయు సిద్ధులయొక్కయు, స్వచ్ఛ హృదయముల మీదనది సంపూర్ణముగ బ్రతిఫలించును.

* పాదరసము పూసిన యద్దములో మనుష్యుడు తన ప్రతిబింబమును చూడగలుగును. అట్లే వైరాగ్యముగల మనుష్యుని యొక్క పావన హృదయములో నీశ్వర ప్రతిబింబము ఫలించుచుండును.

* నీ మతములో యెల్లప్పుడు స్థిరముగా నిలువబడుము. కాని యసహనమును మౌఢ్యమును విడిచిపెట్టుము.

* నూతిలోని కప్పవలె నుండవద్దు. ఆ కప్ప తన నూతికంటె విశాలమైనదియు గొప్పదియు మరియొకటి లేదని తలంచును. మతోన్మాదముగల వారందరు నట్టివారే. వారు తమ మతమే సర్వశ్రేష్ఠమందురు. గాని తక్కిన

మతములలోని మంచిని చూడరు.

* కొత్త కోడలు మామాగారికి నత్తగారికి తక్కిన పెద్దలకు వినయముగ నడుచుకొనుచు తన మగని మీద భక్తి నెప్పటియట్లే నిలుపుకొనునట్లు నీవును నీ యిష్టదైవతము మీద నధికభక్తిగలవాడవై యుండి తక్కిన దేవతలను నిరాకరింపకుము.

* నిజముగా మతము మీద భక్తిగలవాడు తక్కిన మతములు గూడా పరమ పదమునకు మార్గములేయని తలచును. అన్యమతముల మీద మన మెల్లప్పుడు గౌరవము నిలుపవలయును.

* విచారము గలిగినప్పుడు వచ్చు కన్నీళ్ళు సంతోషము గల్గినప్పుడు వచ్చునానంద బాష్పములు నొక్కనేత్రమునుండి పుట్టి చెరియొక కొననుండి కారును. దుఃఖజలము ముక్కునకు సమీపమునుండు కంటికొన నుండి కారును. ఆనందబాష్పములు రెండవ కొననుండి కారును.

* ప్రపంచమెట్లున్నది. ఉసిరికాయవలెనున్నది. ఉసిరికాయ యందు గింజ పెద్దది. గుంజు తక్కువ. తింటే వగరు. కడుపునొప్పి.

* మనము జగన్మాతయైన దేవినేల చూడజాలము?

సమా: ఆమె గొప్ప యింటి స్త్రీ వంటిది. తెర వెనుక నుండి యందరిని జూచుచు తానెవ్వరికి గనపడక తన వ్యవహారమంతయు నామె చక్కగా చేసికొనుచుండును. ఆమె కొడుకులు మాత్రమే తెరదాటి వెళ్ళియామెను చూడగలరు. అట్లే మాయయను తెర మరుగుననున్న దేవిని సద్భక్తులు మాత్రమే చూడగలరు.

* పడవ నీటిలో నుండ వచ్చును. కాని నీరు పడవలో నుండకూడదు. అట్లే యీశ్వరాన్వేషకులు ప్రపంచమునుండవచ్చును. కాని ప్రపంచము వానిలో నుండకూడదు.

ప్రశ్న: భక్తునికేది బలము?

సమా: కన్నీళ్ళే బలము. ఏడ్చుచున్న బిడ్డను తల్లియోదార్చి దానికోర్కె తీర్చుచున్నట్లే దుఃఖించుచున్న భక్తుని దయతో నోదార్చి భగవంతు డాదరించును.

* దొంగను మనము కనుగొన్నప్పుడు వాడు పారిపోవును. అట్లే విశ్వమును మోహింపజేయునట్టి మాయను మనము కనుగొందుమేని వెంటనే యది యంతర్ధానమగును.

* మనుష్యుడెప్పుడు ముక్తుడగును?

అహంకారమెప్పుడు జచ్చునోయప్పుడు.

* ప్రతి మనుష్యుడును దన మతమునే యనుసరింపవలయును. మహమ్మదీయుడు మహమ్మదీయ మతమును, క్రైస్తవుడు క్రైస్తవ మతమునను సరించుట మంచిది. హిందువులకు మహాఋషుల మతమేర్పడి యున్నది. కనుక వారు దానినే యవలంబించుట కర్తవ్యము.

* లేత వెదురును సులభముగా వంచవచ్చును. ముదురు వెదురు వంచదలచితిమేని వెంటనేయది పెళుక్కుమని విరుగును. లేత హృదయములను మంచి పనులవైపు ద్రిప్పుట సులభము. కాని ముసలి గుండె వంచదలచుకొన్నప్పుడు పట్టుదప్పి పోవును.

* ఎండినయాకులు వాటి ప్రయత్నముగాని, యిష్టముగాని లేకయే గాలిచేత నెగరగొట్టబడి పోవును గదా! అట్లే భగవంతుని నమ్ముకొని యుండువారు ఆయన యిచ్ఛతో గలసిమెలగుదురు. వారి యిచ్ఛయెంత మాత్రముండదు. వారి ప్రయత్నమంతకంటెనుండదు.

---

"నిర్ధనోపి సదాతుష్టో
ప్య సహాయోమహాబలః
నిత్యతృప్తో ప్య భుంజానో
ప్యసమః సమదర్శనః"

ఆత్మజ్ఞానియైనవాడు నిర్ధనుడైనా అసహాయుడైనా నిత్యుపవాసం ఉన్నా యెల్లవేళలా సంతృప్తుడయి ఉంటాడు.

- శంకర భగవత్పాదులు - వివేక చూడామణి

# ఆత్మవిద్య

*- వేదాంత భాస్కర శ్రీ కలిదిండి నారాయణరాజు*

*(శ్రీ స్వామి జ్ఞానానంద శతజయంతి నివాళి)*

"ఆధ్యాత్మ విద్యావిద్యానాం". విద్యలలో ఆధ్యాత్మ విద్యతానే అని, భగవంతుని మాట. మన భారతదేశం, బ్రహ్మవిద్యకు మూలకేంద్రము. అనాది నుండి ఎందరెందరో మహానీయులు సత్యాన్వేషణ తత్పరులై అంతర్ ముఖ బుద్ధిచే దివ్యానుభూతిని పొంది, తదనుభవమును లోకమునకు ప్రబోధించి యున్నారు.

వారు చెప్పిందే చెప్పడానికి రారు. మరికొందరు మహనీయులు, ఈ ప్రపంచాన్ని గమ్యం దిశగా, మరికొంత, ముందుకు ఆధ్యాత్మికముగా నడపడానికి వస్తారు. ప్రాచీన మహనీయులు చెప్పింది సత్యమే అయినా, ఈ క్రొత్తవారు చెప్పేది కాలానుగుణంగా అధికతరసత్యంగాన, ఈ నూతన భవ్యతర సత్యాన్ని గ్రహించడానికి, జిజ్ఞాసువులు, సుముఖంగా ఉండాలని కోరుచున్నాను. జ్ఞాన, విజ్ఞాన సమన్వయ సాధనానుభవమే. భవ్యతర నిత్య సత్యము. ఆ, అనుభవమును లోకమునకు చాటిన మహనీయులే శ్రీస్వామి జ్ఞాననందసద్గురు దేవులు. మన ఆత్మ స్వరూపమే, బ్రహ్మమై యుండుట వలన, ఆత్మవిద్యయే బ్రహ్మవిద్య, ఆత్మ స్వరూపమందు స్థితి పొందినచో, బ్రహ్మమునందు స్థితి పొందుటయే అగును, అటువంటి బ్రహ్మానుభవము పొందగలిగారు గనుకనే I. AM. HE - I. AM.HE అని పూజ్య స్వామి జ్ఞానానందసద్గురువు వారి దివ్యవాక్.

I. AM. HE అనగా అదే నేను అని కదా! "ఏది నేను" అను విషయం గురించి నా భావమేమనగా? ప్రతి మానవులోనూ, ఉన్న ఆత్మ, మనస్సు, బుద్ధి అనువాటిని గురించి ముందుగా కాస్త తెలుసుకొందాము. నిశిత దృష్టితో యోచించినచో, మనస్సునకు, బుద్ధికి స్వాతంత్ర్యం ఉన్నదా అంటే, లేదని చెప్పవచ్చును. ఈ మనస్సు, బుద్ధి, ఒక అతీతపరమ శక్తిచేత పరిపాలింపబడుచున్నవి. బుద్ధితాను వెనుకకు తిరిగి, తనను నడుపుచున్న నిత్యసత్యాత్మను పట్టుకొనలేదు. మనస్సునకు కూడా, ఆ నిత్యసత్యాత్మను.

నీవు ఎక్కడ ఉన్నావు. ఏమి చేస్తున్నావు అని స్వతంత్రించి ప్రశ్న వేసే శక్తిలేదు. నిత్యసత్యాత్మను ప్రశ్నించే శక్తి మనస్సునకుగాని బుద్ధికికాని లేదు. ఆ నిత్య సత్యాత్మ మనోబుద్ధులకు, అతీతమై ప్రకాశిస్తూఉంది. ఆ నిత్య సత్యాత్మయే మనలో `నేను'గా వ్యవహరింపబడుచున్నది. ఆ పరిశుద్ధమైన `నేను' నిమిత్తం కాలస్థలాలకు అతీతమైనది.

ఈ పరిపూర్ణమైన `నేను' అనే సత్యాత్మ `ఓమ్' కృతి చేత వ్యవహృతమై యున్నది. "ఓమిత్యేకాక్షం బ్రహ్మ" ఓమ్. అంటే `నేను'గా వ్యవహరింపబడే నిత్యసత్యాత్మ అని గ్రహించవలెను.

ఓంకార స్మరణ గావించేటప్పుడు; మన స్వస్వరూప ధ్యానమే చేయవలెను. ఆ స్వస్వరూపమైన, నేను నీవే అని హృదయ పూర్వకముగా, సంభావన చేయవలెను. ఇటువంటి గాఢమైన ధ్యానం చేత, మనస్సు నిత్యసత్యమైన `నేను' నీవే అని ఆపరమాత్మను భావించుచూ, దివ్యానుభూతిని పొందవచ్చును. చూడండి. మానవునిలో ఎంత దివ్య పరిణామం, ఎంత మహత్తరమైన పరివర్తన కలుగుచున్నదో గ్రహించండి. అటువంటి పరిణామం సిద్ధించగనే, సర్వ స్థలవ్యాపకుడును `నేనే' సమస్త కాలగతుడను `నేనే' సమస్త స్థల జగదాధారమైన పరమాత్మను `నేనే' అనే భావం అనుభవమునకు వచ్చి తీరును. ఇది ఏదో అజ్ఞాన ప్రగల్భము మాత్రము కాదు సుమండి. `యద్భావం తద్భవతి' అని కదా. గనుక ఆ భావంతో ధ్యాన సాధన చేసే మానవుడు మాధవునిగా రూపొందును. బ్రహ్మీభూత మహర్షి పూజ్య స్వామి జ్ఞానానంద గురుదేవుల దివ్య అనుభవవాక్కు I- AM. HE- I. AM.HE అనగా? అదే నేను - అదే నేను అనే అనుభవ వాక్ యొక్క సాధన సారాంశము ఇదే అని నానిండైన అభిప్రాయము.

